ప్రాక్ప్రతీచీ గ్రంథమాలలో నిది తృతీయ పుష్ప ముగ ప్రచురించి యాంధ్రమహాశయుల సమక్షమున భక్తిపూర్వకముగ నివేదించుచున్నాము.

ఈ గ్రంథమాలయందు మే మిదివరకు ప్రకటించిన 'పాశ్చాత్యభావ ప్రపంచము', 'హిందూ జీవనపథము' అనుగ్రంథములు రెండును ఆంధ్రుల యాదరమునకు పాత్రము లయ్యెను. అవి విరివిగ పఠింపబడుటకు వివిధ మార్గముల తోడ్పడిన మిత్రులెల్లరు వందనీయులు. ఈ గ్రంథము కూడ వారి సన్మానము బడయు నని విశ్వ సించు చున్నాము.

ప్రాక్ప్రతీచీ సమన్వయమునకు సాయపడు గ్రంథ ములను మాత్రమె వీలునుబట్టి యప్పుడప్పుడు ప్రచు రింప గడంగిన మా యుద్యమము స్వల్ప మయినదే యయినను, వలసిన సాహాయ్యము చేకూరిననె గాని యది నెరవేరుట యసంభవము. సానుభూతి గలిగి తన్ని ర్వహణ కార్యమున మా కాలోచన లొసంగుచు బహు భంగుల సాయపడుచున్న మా పుర ప్రముఖులగు శ్రీయుత ముత్తంగి జగ్గా రావుగారి కత్యంత కృతజ్ఞులము.

ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల,
రాజమహేంద్రవరము.

కామరాజు హనుమంతరావు,
సంపాదకుడు.

ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల : 3

# నవ్యభారతోదయము

కామరాజు హనుమంతరావుగారు

తొలిపలుకు రాజమహేంద్రవర కళాశాలాధ్యక్షులు,
ప్రొఫెసర్ దిట్టకవి సుబ్రహ్మణ్యశర్మ, ఎమ్. ఏ.,
గారిచే విరచితము

ప్రాక్ ప్రతీచీ గ్రంథాలయము
రాజమహేంద్రవరము

EAST AND WEST SERIES

*Editor:* K. HANUMANTA RAO.

# సర్వస్వామ్య సంకలితము

1935

వెల:

కేపరు బైండింగు రు. 1-0-0

అట్ట బైండింగు రు. 1-4-0

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్, రాజమండ్రి.

భక్తవరుడగు

మా త్రిపితృ దేవునకు

అంకితము

# FOREWORD

I have very great pleasure in writing this Foreword to the outline of Hindu religious thought contained in the following pages. The very idea of the author that the Hindu Dharma is a flowing stream is in refreshing contrast to the utterances of those who are unable to realise that "a perfection that has been is not the perfection for us." Accordingly his treatment of the subject fills us with the hope that Hinduism has a future as well as a past and that, if only we learn to interpret the teachings of the Upanishads and the Bhagavad Gita in terms of our own age and in the light of our own needs, we shall have the glory of being the worthy continuators of a great tradition. It is as wrong to be satisfied merely with the achievements of our

ancestors as to be disloyal to them. If to cut ourselves away from our ancient heritage is to reduce ourselves to beggary, to put it in a museum and invite all the world to come and admire it is to court death itself. After all religion lives in the hearts of men who think and feel and act, and not in books, however sacred they may be. If there are no Hindus who at the present day cannot translate the experience of a Yagnavalkya or a Sandilya into their own lives, that experience is as good as dead and non-existent, though it is recorded in our sacred books. Our Sanatana Dharma, in spite of all changes, is *sanatana* only in the sense in which our souls are immortal, in spite of onr repeated births and deaths. Sir P. S. Sivaswamy Aiyar in his Kamala Lectures has conclusively shown how the Hindu moral ideals have changed from age to age. And yet we know that the moral spirit

of our nation is still alive, and in our own generation has added a glorious page to the ethical history of mankind. The author of this little book before me has shown how the spirit of our Rishis—the founders of Hinduism—still lives in a Gandhi and a Tagore, in an Aurobindo and a Radhakrishnan. One may not agree with every statement he makes in the following pages, but one cannot fail to see the loftiness of his theme and the earnestness and sincerity with which he pursues it. I therefore heartily commend his work to the Telugu-reading public.

Rajahmundry,
12—11—1935.

D. S. SARMA.

# తొలి పలుకు

ప్రొఫెసర్ దిట్టకవి సుబ్రహ్మణ్యశర్మ ఎమ్. ఏ. గారు
ఆంగ్లమున వ్రాసిన 'Foreword' కు అవానుదము:

హిందూధార్మికభావమును సంక్షిప్తముగ వివరించు ఈ పుస్తకమునకు తొలిపలుకు వ్రాయుట నా కెంతయు సంతోషకరముగ నున్నది. "పూర్వ మొకప్పుడు అనుభూత మయిన పరిపూర్ణత ప్రికృతమున మనకు పరిపూర్ణత కానేరదు." అను విషయము గమనింపజాలని వారితో నేకీభవింపక, హిందూధర్మము ప్రవహించు నొక మహావాహిని యని యీ కృతికర్త భావించుటయె యామోదము గొల్పుచున్నది. కావున, హిందూధర్మమునకు గతజీవనమె గాక భావిజీవనము గూడ కలదనియు, మన యిప్పటి యుగపరిభాషలో మన యక్కరలకు దగినటుల ఉపనిషత్తులు, భగవద్గీత బోధించు సత్యముల వ్యక్తీకరించుటకు నేర్చుకొనిన పక్షమున నే, ఒక యుత్తమసంప్రదాయమును ప్రవర్ధమానము జేయు నుత్కృష్టయోగ్యతకు మనము పాత్రులము కాగలమని

యు తెలుపు ఈ గ్రంథరచనావిధానము మనల న శ్రా
పూరితుల గావించు చున్నది. ప్రాచీను లత్యంతకృషి
తో సాధించిన విషయముల నిరసించుట యెంత యవ
చారమో వానితోడనె సంతృప్తి జెంది యూరకుండుట
కూడ నంతే దోషము. మన పూర్వుల సంచితవిజ్ఞానము
తోడి సంబంధము తెగించుకొనుటవలన మనల మనమె
దరిద్రులనుగ జేసికొనువార మగుదుమేని, దానిని చిత్ర
వస్తుప్రదర్శనశాలలో నుంచి శ్లాఘించుటకై యావత్ప్ర
పంచవాసుల నాహ్వానించుట మృత్యువును వరించుటవం
టిదే యగును. ఇంతకును జిజ్ఞాస, సంభావనము, అను
ష్ఠానము — ఇవి గల మహనీయుల హృదయములందె
గాని యెంతటి ప్రామాణ్యత వహించిన గ్రంథములం
దైనను అది సజీవముగ నుండదు. యాజ్ఞవల్క్యునియొక్క-
గాని శాండిల్యునియొక్క- గాని యనుభవమును ప్రస్తుత
కాలమున తమ జీవితములలో మూర్తీభవింప జేయగల
హిందువులు లేనియెడల, ఆ యనుభవము పవిత్రగ్రంథ
ములలో లిఖితరూపమున నున్నను వినాశము జెందినట్లే,
లేనట్లే. జననమరణపరంపరకు మనము లోనయినను
మన యాత్మ లెవ్విధమున శాశ్వతములో, అవ్విధము

నని మన సనాతనధర్మము పరివర్తనముల జెందుచున్నను 'సనాతన' మనుచున్నది. హిందూనైతికాదర్శములు యుగయుగములనుండి పరిణామము జెందుచు వచ్చిన క్రమము సర్. పి. ఎస్. శివస్వామి అయ్యర్ గారు తా మొసంగిన 'కమల' ఉపన్యాసములందు నిర్ధారణముగ స్పష్టపరచి యున్నారు. మన జాతీయనైతికశక్తి యింక ను జీవించి యుండి విశ్వమానవ ధార్మిక చరిత్రమునందు మరియొక యుజ్వల మగు ప్రకరణము నిక్కాలముననె చేర్చిన దని మనకు తెలిసిన విషయమె. నా యెదుట నున్న యీ చిన్ని గ్రంథముయొక్క రచయిత హిందూ ధర్మమూలపురుషు లగు మన ఋషుల యాధ్యాత్మిక జీవనము గాంధి, టాగూర్, అరవింద, రాధాకృష్ణ వంటి మహనీయులలో నేటికిని దీప్తివంతముగ నున్న దని కనపరచు చున్నారు. వారు తెలిపిన ప్రతిఅభిప్రా య మెవరికైన నంగీకృతము గాకపోవచ్చును; కాని గ్రంథవిషయౌన్నత్యమును, తద్వ్యక్తీకరణమందలి వారి వినిర్మల భక్త్యుత్సాహములను నెల్లరు గమనింపక తప్ప దు. కనుక ఆంధ్రపాఠకలోకమునకు నే నీ పుస్తకము పఠనయోగ్యమయిన దని యెరుకపరచుట కానందించు చున్నాను.

# అవతారిక

ఆదికాలమునుండి నేటివరకు గల హైందవధర్మజీవనముతో సంబంధించిన మహద్విషయము అల్పజ్ఞుడ నయిన నేను ఈ చిన్ని పుస్తకమందు వ్యక్తీకరింప బూనుట యమితసాహసముగ గన్పట్టును. సంస్కృతగ్రంథములు స్వయముగ జదివి యర్థము చేసికొను శక్తి గాని, తత్త్వ విషయములను గురించి స్వతంత్రాభిప్రాయములు వెలిబుచ్చు నధికారము గాని లేకపోవుట వాస్తవము.

అయినను, సంస్కృతపండితులును తత్త్వజ్ఞానసంపన్నులు నై ప్రమాణపురుషులుగ ప్రసిద్ధి జెందిన మహనీయుల గ్రంథరాజములను ముఖ్యాధారములుగ గైకొని యీ రచనకు గడంగితిని. తద్గ్రంథకర్తల యందలి గౌరవమునుబట్టి యిది యాంధ్రమహాశయుల కాదరపాత్రము కా గల దని యాశించు చున్నాను. నా యుద్యమమున కాధారభూతు లయిన యా మహాపురుషు లెల్లరకు నా వందనశతములు. వారు నా కాత్మప్రబోధకులు కూడ నై యుండుటవలన, నా కెంతయు భక్తిభాజనులు.

ఇట్లు తెలుపుట గ్రంథవిషయమున నా బాధ్యతయం తయు పూర్తిగ తొలగించుకొనుటకు గాదు. జ్ఞానాధికుల భావములను గ్రహించుటలోను, గ్రహించినవి వ్యక్తీక రించుటలోను నే నెవ్వియయిన లోపములు చేసియుండ వచ్చును. నా దోషములవలన కలుగు కళంకము వారి కాపాదితము గా కుండును గాక! నా పొరపాటుల నెల్ల నా కెరిగించు వారి కత్యంతకృతజ్ఞుడను.

ఇందలి కొన్ని యంశములనుగురించి మన ప్రాంత ములలో నే నచ్చటచ్చట నిదివర కుపన్యాసముల నొసంగి యుంటిని. శ్రోతలు కొందరు వానిని పుస్తకరూపమున ప్రకటింపవలసిన దని గోరిరి. వారి హృదయపూర్వక వాంఛ నా సంకల్పమునకు ప్రథమ హెచ్చరిక యై యుం డెను. ఆ సుహృదయు లెల్లర గడుప్రేమతో స్మరించు చున్నాను.

ధార్మికవిషయములు గ్రహించుటలో నేను పేర్కొ నిన వారె గాక తదితరగ్రంథకర్తలును నాకు దోడ్ప డిరి. వారి యభిప్రాయములు గూడ నుదాహరింప కుం డుటకు కారణము చర్చితాంశము చర్వితచర్వణ మగు

ననియె. కాని వారందరు నాకు సాయపడి యుండుటచే మిగుల వందనీయులు.

ధర్మాభిరతులును ఆంగ్లసంస్కృతభాషా కోవిదులు నయి ప్రస్తుతము రాజమహేంద్రవరములో దొరతనము వారి కళాశాలాధ్యక్షులుగ నున్న ప్రొఫెసర్ దిట్టకవి సుబ్రహ్మణ్యశర్మ ఎమ్. ఏ. గారికి నేను ప్రత్యేకముగ కృతజ్ఞత తెలుపవలసి యున్నాను. హిందూమతమును గూర్చియు, భగవద్గీతనుగూర్చియు వారు రచించిన గ్రంథములు నాకు సాయపడి యుండుటయె గాక వారు నా వ్రాతప్రతిని సాకల్యముగ జదివి సంస్కృతశ్లోకములు సరిచూచి కొన్ని సలహాల నొసంగిరి. మరియు నా కృషికి నామోదము తెలిపి తొలిపలుకు వ్రాసి యిచ్చుటకు సయిత మియ్యకొనిరి. వా రీతీరున గావించిన యమూల్యసాహాయ్యమునకు నా మనఃపూర్వకప్రణామములు.

కా. హనుమంతరావు.

# విషయములు



౨౧౩ వ పుటలో గల సవరణలు గమనింప ప్రార్థితులు.

భారతదేశ భాగ్యము

హైందవ ధర్మ తత్త్వము

వైదిక సమన్వయము

ఉపనిషత్సమన్వయము

భగవద్గీతా సమన్వయము

తాంత్రిక సమన్వయము

మధ్యమయుగ సమన్వయము

భారత చరిత్రాధిక్యత

## హైందవధర్మవాహిని

భారతదేశము గాఢనిద్రనుండి మేలుకొనినది; పూర్వ ప్రతిభను జ్ఞప్తికి దెచ్చుకొనుచు ఆధ్యాత్మికనిజజీవనము వ్యక్తపరుప మొదలిడినది; ప్రపంచమందు తన యర్హస్థాన మాక్రమింప గడంగినది. భారతదేశ హైన్యమునె యింకను దలపోయుచు నిరాశానిరుత్సాహములకు లోబడువారు దివ్యదృష్టి గల ఋషిసత్తముడును జగద్విఖ్యాతి గాంచిన కవిసార్వభౌముడు నగు రవీంద్రుడు గానముచేయుచున్న జయగీతము నాలకింతురుగాక! నేడది బహుసభామండపములందు స్మరింపబడు చున్నది; అనేక స్త్రీపురుషులయొక్కయు బాలబాలికలయొక్కయు శ్రావ్యకంఠములనుండి యుచ్చైశ్స్వరమున వెలువడుచున్నది. నిద్రాసక్తులైయున్న భారతీయులు అది విని జాగరిల్లి ధైర్యోత్సాహముల బడయుదురు గాక! ఆ విజయగానమిదే. గమనింపుడు.

“జనగణమన అధినాయక జయహే భారతభాగ్యవిధాతా!
పంజాబ్ సింధు గుజరాట్ మరాఠా ద్రావిడ ఉత్కళ వంగ

వింధ్య హిమాచల యమునా గంగా ఉచ్ఛల జలధి తరంగ;
తవ శుభ నామే జాగే తవ శుభ ఆశిష్ మాగే,
గాహే తవ జయగాథా.
జనగణ మంగళదాయక జయహే భారతభాగ్య విధాతా!
జయహే జయహే జయహే జయ జయ జయ జయహే."

విశ్వమానవహృదయాధిపతి వగు ఓ భారతభాగ్య విధాతా! నీకు జయ మగును గాక! భరతఖండములోని పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్రము, ద్రావిడము, ఉత్కళము, వంగదేశము మున్నగు ప్రాంతము లెల్లను, వింధ్యహిమాచలాదిమహాపర్వతము లన్నియు నీ శుభనామము విని మేల్కొని నీ శుభాశీర్వాద మర్థించుచు జయధ్వానములు సలుపుచున్నవి. సర్వజనమంగళ ప్రదాయకుడవగు ఓ భారతభాగ్యవిధాతా! నీకు దిగ్విజయ మగును గాక! ఈ తీరున ఆశాపూరితహృదయముతో, విశ్వాసభరిత మానసముతో రవీంద్రుడు అద్భుతగానము వినిపించుచున్నాడు. ఆ సువార్త ప్రపంచమం దెల్లెడలను మారుమ్రోగుచున్నది. యుగయుగాంతరములనుండి భారతీయులను పాలించి నడపుచుండిన భగవా

నుడు నేడును వారికి తోడగుచు, వారి జీవితనిహితార్థము వారికి మరల స్ఫురింపజేయు, వారు నూతనోజ్జీవము బడయుచున్నారు.

## భారతదేశ భాగ్యము

పూర్వము హిందూదేశము ధర్మజీవనమునందు పొందిన యౌన్నత్యమును గురించి యిప్పుడును స్వదేశస్థులు మాత్రమె గాక విదేశస్థులు కూడ ప్రశంసాపూర్వకముగ ముచ్చటింతురు. కాని యది భౌతికసంపదకంటె ధార్మికసంపద నెక్కుడు శ్రేష్ఠముగ పరిగణించెనని, ధార్మికభాగ్యముమూలముననె భౌతికభాగ్యమును సయితము గడించెనని తగినంతగ నేడు గుర్తింపబడుట లేదు. ధర్మగ్లానితో బాటు ఐహికదారిద్ర్యమును దానినావహించెను. ఆధ్యాత్మికజీవనమునకే భారతీయులు పూర్వ మధిక ప్రాముఖ్యత నిచ్చి ధర్మతత్పరులై యున్నను, వారు ప్రాపంచికైశ్వర్యములందు కూడ నుచ్చస్థితియం దుండిరి. కాని తమసంపదనుగురించి చెప్పు

కొను చున్నారు, "ఏషాస్య పరమాసంపత్"[1] అని చెప్పు కొనిరి. ధర్మజీవనము భారతదేశమం దొకప్పు డెక్కువ గను నొకప్పుడు తక్కువగను నాచరణములో నున్నను, అది యెప్పుడును పూర్తిగ నంతరింపలేదు. నివురు గప్పిన నిప్పువలె నది కొంతకాలము కాన్పింపక పోవుటయు వాస్తవము; కాని యట్టి తరుణమునందు నావశ్యకతను బట్టి యే కొలదివ్యక్తులద్వారముననో జ్వలించుచునె యుండెను. భారతీయుల భాగ్యము ధర్మసంపదయె. ఆర్యఋషి సంతతికి జెందిన భారతీయులు "ఇహ చేదవేదీ దథ సత్య మస్తి న చేదిహా వేదీ న్మహతీవినష్టిః"[2] అను నార్యోక్తి మది నిలిపి తమకు కలిగిన ధననష్టము కంటె ధర్మవినాశము నెక్కుడు నష్టముగా నెంచవల యును. సత్యముకొరకు సర్వస్వము విడనాడిన హరిశ్చం ద్రునిగాథయు, పితృవాక్యపరిపాలనమునకై యడవుల పాలయిన రామచంద్రుని చరిత్రయు భారతీయులకు నిరంతరము స్మరణీయము లై వారి జీవితముల నడుప

1. బృహదారణ్యకోపనిషత్తు VI-3-32.
2. కేనోపనిషత్తు II-5.

వలయును. బహుకాల పరంపరాగతముగ హిందూదేశ మున నేకమహావాహినిగ ప్రవహించుచున్న ధర్మము యొక్క లక్షణ మెట్టిదో, అది యే కాలమున నెట్టి విశాలరూపము దాల్చెనో గమనించుట యావశ్యకము.

## హైందవ ధర్మతత్త్వము.

"ఒక విధముగా భేదము చూపవలసినయెడల, ఆధ్యాత్మిక విజ్ఞానము సమన్వయమునకును, భౌతిక హేతు జ్ఞానము విమర్శనమునకును నెక్కుడుగ గడంగును. మొదటిది యావద్విశ్వమునకు సంబంధించిన తత్త్వవిచారణము సలుపును. ఆ విచారణము ఒక విశాలభావనా దృశ్యమునందు సకలవస్తువుల యుత్పత్తిని సర్వయుగముల చరిత్రను, సమస్తసృష్టియొక్క విలయమును సమగ్రముగ దర్శించును. రెండవది ప్రాపంచిక స్థూలవిషయములను ప్రత్యేకముగ పరిశీలించుచు నైకత్యతను సంపూర్ణతను గుర్తింపదు. హైందవతత్త్వవేత్తలు జగత్తునుగురించి సర్వాతీతమును విశ్వజనీనము నయిన యాదర్శముల వ్యక్తపరతురు; విశేషముగ భావప్రపంచమున విహరించి

యందరాని యాశయముల నాశించుచు లోకములో
శుష్కభ్రాంతచిత్తుల సంఖ్య పెంచుచున్నారను నాక్షే
పణమునకు గురి యగుచున్నారు. పాశ్చాత్యజ్ఞానులు
చాలవరకు ప్రతివస్తువును విడదీసి ప్రత్యేకముగ పరిశీలిం
చుచు ఫలమునుబట్టి వస్తుతత్త్వమును నిర్ణయింతురు.
తమ పరిశోధనయందు పాశ్చాత్యులు ఇంద్రియజ్ఞాన
మును, హైందవులు ఆత్మజ్ఞానమును పురస్కరించు
కొందురు.''[1] అని పండిత రాధాకృష్ణన్ తెలుపు

1. The speculative mind is more synthetic, while the scientific one is more analytic, if such a distinction be permitted. The former tends to create cosmic philosophies which embrace in one comprehensive vision the origin of all things, the history of ages and the dessolution and decay of the world. The latter is inclined to linger over the dull particulars of the world and miss the sense of oneness and wholeness. Indian thought attempts vast, impersonal views of existence, and makes it easy for the critic to bring the charge of being more idealistic and contemplative, producing dreamy visionaries and strangers in the world, while western thought is more particularist and pregmatistic. The latter depends on what we call the senses, the former

చున్నాడు. మానవప్రకృతియందు నింద్రియజన్యజ్ఞానము మించి యాత్మీయవిజ్ఞానము సూక్ష్మతరదృష్టిని గలిగి వస్తుల బాహ్యవిభేదమును గాక వాని యంతరమున పరస్పరసంబంధముతో వెలయు నైక్యతను గాంచును. హిందూతత్త్వజ్ఞులు ఇట్టి దివ్యదృష్టితో సర్వమునందు సమన్వయము కనుగొనగలిగిరి. శరీరపోషణకావశ్యకమయిన సమస్త పదార్థముల ననాయాసముగ లభింపజేయుచు నార్యఋషిపుంగవుల కృషియంతయు భౌతికవస్తుసంపాదనమునకు గాక యాధ్యాత్మికధర్మలాభమునకు వినియోగించుటకు తోడ్పడిన భారతదేశము పుణ్యభూమి యనుటలో నాశ్చర్యమేమి? హిందూధర్మ మెట్టి తరగతులకు చోటియ్యని యొక మతముగా నెంచదగదు; వివిధశ్రేణులకు జెందిన భిన్నమతములను పరస్పరసంబంధములోనికి దెచ్చు నాధ్యాత్మిక సమన్వయవిధానముగ పరిగణింపవలెను. ధర్మ మను పదమే చేర్చిపట్టుకొనుట యని యర్థమిచ్చు సంస్కృతశబ్దమునుండి

presses the soul sense into the service of speculation
*S. Radhakrishnan: Indian Philosophy Vol. I—p. 31.*

యుత్పన్న మయినది. హైందవధర్మము మొదటినుండి నేటివరకు భిన్నమతములను సమన్వయపరచుచు తదవలంబకు లయిన వివిధజాతుల నంతర్భుక్తము గావించుటకై సలిపిన ముఖ్యప్రయత్నముల పరికించి దాని పరిణామక్రమమును జూతము.

## వైదిక సమన్వయము.

ఆర్యులు హిందూదేశములో పంజాబు అనబడు ప్రదేశమును ప్రథమమున నాక్రమించి యాదిమవాసుల వశపరచుకొని వారితో నెట్టి కలహములు కలుగకుండ ప్రశాంతపరిస్థితుల నెలకొల్పి సుఖముగ జీవించుచుండిరి. పంచోపనదులు గలిగి మహాజీవనదులలో నొకటిగ బ్రసిద్ధి జెందిన సింధునదితోడను వివిధవృక్షలతాదులతోడను శోభిల్లుచు, పరిసరహిమాలయగభీరదృశ్యములతో విలసిల్లుచు పంజాబుదేశము నాటి యార్యులదృష్టిని ప్రకృతివైచిత్ర్యములవైపునకు మరల్చెను. సూర్యుడు దివ్యతేజమును వెదజల్లుచు వారి చక్షువుల మిరుమిట్లు గొల్పెను. వాయువు పుష్పసుగంధముతో నిర్మలముగ వీచుచు

వారి శరీరము నాహ్లాదపరచెను. పృథ్వి వివిధసస్య ఫలాదులను ప్రసాదించుచు వారి జిహ్వకు విందు గొల్పెను. వర్ష ములు నియమిత కాలములో కురియుచు వారికి విస్మయ కరములుగ నుండెను. ఇట్లు సృష్టిలోని సకలమహత్తర పదార్థములు వారియెదుట నద్భుతశక్తియుతములుగను అమితప్రయోజన కరములుగను నిలచి వారియందు భక్తిగౌరవముల బురికొల్పెను. కృతజ్ఞతాప్రేరితులై వారు వాని నన్నిటిని స్తుతించిరి. ఆకాశము, భూమి, అగ్ని, వాయువు, ఇంద్రుడు, వరుణుడు, సూర్యుడు, సింధుసరస్వతీనదులు, అరణ్యము మొదలగునవి యెల్ల పూజనీయములగు దేవత లయ్యెను. వానిలో నొక్కొక్క దానికి భక్తిపూర్వకవందనము లర్పింపబడెను. బహు దేవతారాధన వెలసెను. కాని యార్యుల హృదయ ములు గభీరత జెందినకొలది, వా రాధ్యాత్మికముగ మహోన్నతస్థితి బడసిరి. భిన్న దేవతలు తమతో సంబం ధము లేకుండ ప్రత్యేకముగ నున్న వను భావము నతిక్ర మించి యవి యన్నియు తమతో నొక విశ్వజనీనాశ్రయ ద్వారమున సన్నిహితసంబంధము కలిగియున్న వను భావము క్రమేణ బడయగలిగిరి. ప్రపంచము భిన్నవస్తు

వుల సముదాయము గాక యన్యోన్యసంబంధముతో చరించు వివిధాంగములు గల శరీరమువంటి దని వారు గ్రహించిరి. జగత్తున వ్యక్తమగు శక్తులు భిన్నములు గాక యేకమహాశక్తియొక్క వివిధపరిణామము లని వారు గమనించిరి. ఋగ్వేదమునందు పరబ్రహ్మము తన్ను గూర్చి యీ విధముగ జెప్పుకొని నట్లు గలదు. "ఓ మహాజనులారా! విశ్వమంతయు రూపము దాల్చుటకు పూర్వమె నే నుంటిని. నేను విశ్వవిభుడను. సర్వసృష్టికి నేను హేతుభూతుడను. సమస్తైశ్వర్యమునకు నేను కారణు డను, పరిదాతను. బిడ్డలు తండ్రిపై నాధారపడునటుల మానవు లెల్లరు నావంకకె మరలుదురు గాక! సర్వప్రాణులు సుఖముగ జీవించుటకు వలసిన శక్తి నియ్యగల యాహారపానీయము లెల్ల నమర్చునది నేనే." [1] ఈ విధ

1. అహంభు వం వసునః పూర్వ్య స్పతిరహం
ధనాని సంజయామి శశ్వతః ।
మాం హవన్తే పితరం నజ న్తవోహం
దాశుషే విభజామి భోజనం ।

ఋగ్వేదము. ౧౦-48.

ముగ! నార్యఋషులు వేదకాలమందె సృష్టిలో నేకత్వము నిరూపించిరి. ఏ విధముగా బహుదేవతారాధన క్రమముగా నేకపరబ్రహ్మోపాసనగ పరిణమించెనో యించుక చూతము. వేదమునందు ఆర్యులు కొన్నిచోట్ల వరుణుడును, కొన్నిచోట్ల నగ్నియు, కొన్నిచోట్ల నింద్రుడును సర్వదేవతలలో శ్రేష్ఠములుగ జెప్పిరి. తరువాత సకల దేవత లేకేశ్వరునకు లోబడి నడచుకొను నట్లు పరిగణించిరి. ఆ యొక్కడయిన పరమేశ్వరుని విశ్వకర్మ, బృహస్పతి, ప్రజాపతి, హిరణ్యగర్భుడు మున్నగు నామములతో వ్యవహరించిరి. సర్వగతమై సమస్తకార్యములకు కారణభూతమై యున్న ప్రాణశక్తి వారికి విస్పష్టముగ గోచరించినతోడనె, ఈశ్వరుడు విశ్వాతీతుడై బాహ్యమునుండి పాలించు ప్రభువువలె గాక సర్వాంతర్యామియై ప్రాణస్వరూపుడుగ జగత్తునందున్నట్లు దర్శించి యీ ప్రాణస్వరూపమును "సత్" అని పిలచిరి. దానిని అగ్ని, యముడు, మాతరిశ్వా అను పేర్లతో కూడ సంబోధించిరి. దేవాది దేవుడుగను సర్వభౌతికశక్తులకు నధిపతిగను పేర్కొనబడిన పరమేశ్వరుడు సర్వాంతర్గతుడును ప్రాణస్వరూపుడును సృష్టిస్థితిలయకారణుడు

నయిన సత్యస్వరూపముగ పరిణమిల్లెను; "బ్రహ్మ" అని పిలువబడెను. "ఏకమ్ సద్విప్రా బహుధా వదన్తి"[1] అని ఘంటాపదముగ నుడువబడెను. బహుదేవతాభావము ఏకేశ్వరభావముగను, ఏకేశ్వరభావము బ్రహ్మభావముగను మారెను. "ద్యౌః" అను దేవత భౌతికజగత్తునకు నధిపతిగను, వరుణుడు నైతికజీవనము నెలకొల్పు న్యాయస్వరూపుడుగను, ఇంద్రుడు దేశాక్రమణమునకు తోడ్పడు నిష్టదైవముగను, ఈ త్రివిధముల మరికొన్ని దేవతలును పేర్కొనబడెను. పిమ్మట వాని కన్నిటికి ప్రజాపతియో లేక మరొక దైవమో నియంతగ నేర్పరుపబడెను. తుదకు సర్వదేవతలు ఏకమేవాద్వితీయుడగు పరబ్రహ్మమునందు నంతర్లీనము చేయబడెను. ఇట్లు బాహ్యబహుత్వ పరిశీలనద్వారా తదంతర్గతమగు ఏకత్వము వైదికార్యులు నిరూపించి ప్రథమసమన్వయము సాధించిరి.[2]

1. ఋగ్వేదము. I-(164)-46.

2. "In India they reached monism on a more philosophical path, seeing through the veil of the manifold, the unity which underlies it."
*S. Radhakrishnan: Indian Philosophy Vol. I—p. 98.*

## ఉపనిషత్సమన్వయము

పంజాబునుండి ఆర్యులు కొందరు బయలుదేరి ప్రాగ్భాగములందు వ్యాపింప జొచ్చిరి. వారిలో కౌరవులు, పాంచాలురు అని పిలువబడు ముఖ్యజాతు లేర్పడెను. ఉత్తరహిందూస్థాన మంతయు నాక్రమించుకొనిన పిదప, వారు వింధ్యపర్వతములు దాటి దక్షిణదేశమందు ప్రవేశించిరి. గొప్పరాజ్యములు స్థాపించిరి. వా రింత యుచ్ఛస్థితికి వచ్చుటకు కొన్నివందల సంవత్సరములు పట్టెను. క్రీస్తుపుట్టుటకు చాల శతాబ్దముల పూర్వమె వారు సకల రాజ్యవైభవములతోను ప్రాపంచికైశ్వర్యములతోను సుప్రసిద్ధిగాంచిరి. వారి లౌకికాధిక్యతకు వారి ధర్మజీవనము ముఖ్యముగ దోడ్పడెను. ప్రేమస్వభావముతో వారు ఆదిమనివాసులతోడను తమకంటె ముందుగ దేశమున ప్రవేశించి రాజ్యము లేలుచు నాగరికతజెందియున్న ద్రావిడులతోడను మెలగుచు నెల్లరను హిందూధర్మమునందు ప్రవిష్ఠుల జేసిరి. వారి ధార్మికదృష్టి వేదకాలమునందువలె తరువాతను క్రమక్రమముగ గభీరత జెందుచు నూతన సమన్వయవిధానము వెల్లడింపగలిగెను. తన్మూల

మున వారు తమలో తాము అన్యోన్యప్రేమతో వర్తించుటకును, ఇతరజాతులతో నమితసఖ్యముగ జీవించుటకును సాధ్య మయ్యెను. వేదకాలమున వారు సహజసరళ మార్గముల దైవోపాసన సలిపియుండినను, అటుపిమ్మట వారియందు కర్మతత్పరత హెచ్చి యజ్ఞయాగాదులు ప్రబలెను. అవి జరిపించుటకు ప్రత్యేకముగ పురోహితు లేర్పడిరి. వివిధకర్మకాండలను వివరించు బ్రాహ్మణము లను గ్రంథములు రచింపబడెను. మరియు మంత్రతంత్ర ములతో గూడిన భూతవైద్యములు వెలసెను. కేవలము వృత్తులకొరకు వేదకాలమున నేర్పడిన వర్ణభేదము వంశ పరంపరాగతము కాజొచ్చెను. ద్విజు లగు బ్రాహ్మణ క్షత్రియవైశ్యులలో మాత్రము వర్ణకుడ్యములు దాట నలవిగానివిగ బ్రాహ్మణకాలము నాటికి స్థిరపడలేదు. వర్ణసంస్థయొక్క మూలోద్దేశము మరపునకు వచ్చి వర్ణ విభజనమునందు పాటింపవలసిన సమత్వసహకారభావము లంతరించుచు భిన్నవర్ణములందు వైరము లతిశయిల్లెను. ఆదిమనివాసుల యుద్ధారణప్రయత్నము లేకపోయెను. శూద్రు లుత్తమధర్మమునకు దూరు లయిరి. అగ్రవర్ణ ములవారు నిమ్నవర్ణములవారిని హీనముగ జూడమొద

లిడిరి. ద్వేషములు ప్రబలెను. బ్రాహ్మణులలో కొంత యున్నతజీవనము వర్థిల్లె ననుట వాస్తవము. అనుదిన దైవోపాసనము, ఆశ్రమానుగతమయిన త్యాగజీవనము మున్నగు ధార్మికనిష్ఠలు వా రనుసరించుచుండిరి; కాని స్వవిషయమునె జూచుకొనుచు తోడిజనులకు తాము నిర్వర్తింపవలసిన విధుల నిర్వర్తింప జాలకుండిరి. ఎల్లరు కర్మకలాపమున మునిగిరి. సంఘము శిథిలమగుచుండెను. ధర్మోద్ధరణ మవసర మయ్యెను. మహాపురుషులు కొంద ఱందులకు గడంగిరి. జనుల దృష్టిని బాహ్యమునుండి యంతరమునకు ద్రిప్పి వారు తమ యాధ్యాత్మిక స్వభా వమును గుర్తించు నట్లు చేయుటకు నాటి యార్యఋషి పుంగవులు చేసిన జ్ఞానబోధలె యుపనిషత్తులు. వానిలో ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తి రీయ, ఐతరేయ, చాందోగ్య, బృహదారణ్యక, కౌషీతకి, శ్వేతాశ్వతర ఉపనిషత్తులు పండ్రెండుమాత్రము ప్రాము ఖ్యత వహించెను. ప్రపంచమున వివిధ లౌకిక ధార్మిక కర్మ లాచరించుచు జీవింపవలసియున్నను, జగదాధారు డయిన సచ్చిదానందస్వరూపుని మానవులు మరువ దగ దనియు, వారు బాహ్యనిష్టలతో పాటు వాని పవిత్రత

గాపాడు విశుద్ధజ్ఞానము గడించుట యత్యంతావశ్యక మనియు, హృదయపరివర్తనమునకై పాటుపడుట పరమ విధి యనియు నిరూపించి యాంతరికజీవనలక్షణముల నుపనిషత్తులు స్పష్టముగ వివరించెను. అంతరమునకు జని తరచి చూచిన కొలది మానవజీవితము సూక్ష్మతరమును ఆధ్యాత్మికము నగుచు బాహ్యమునకు పరిమితముగ గాన్పించినను నంతరాళమున వాస్తవముగ ననంతమై యున్నట్లు గోచరించును. ఈ యనంతజీవమును పరమాత్మయనియు, అది జగత్తున వ్యక్త మగుటలో సీమాబద్ధ మగు శరీరమును దాల్చుటచే పరిమితముగ గాన్పించు నప్పుడు జీవాత్మ యనియు పిలువబడును. మానవున కొక శరీరము కల దని సామాన్యముగ తలంపబడును. కాని వాని స్థూలదేహమునకు నంతరమున నింకను నాలుగు సూక్ష్మశరీరము లున్నవని కనుగొనబడెను. ఈ యయిదు శరీరములు పంచకోశము లనబడును. పైకి కనబడునది యన్నమయకోశ మని, దాని యంతరమున నుండునది ప్రాణమయకోశమని, దాని యడుగున నుండునది మనోమయకోశ మని, దాని కావలయుండునది విజ్ఞానమయకోశ మని, దాని కింకను మించి యుం

డునది యానందమయకోశ మని, ప్రత్యంతరకోశము దానిపై నందు కోశములం దిమిడి యుండి పరిశీలించిన ద్యోత మగు నని, తైత్తిరీయోపనిషత్తునందు వర్ణింప బడెను. "వాస్తవముగ ఈ శరీరము నశ్వరము; మృత్యువున కధీనము కాని యది యనశ్వరమును అశరీరము నగు నాత్మ యధిష్ఠించు స్థానము."[1] అని చాందోగ్యోపనిషత్తునందు చెప్పబడెను. మనుష్యుడు తన భౌతికశరీరమం దిమిడియున్న యాధ్యాత్మికశక్తులను క్రమక్రమముగ గుర్తించిన కొలది నుచ్చతరజీవనముల బడయును. పంచకోశములలో నొక్కొక్కటి యొక్కొక్క విధమగు ననుభవము సమకూర్చును గాన నన్నిటి యాధారమున క్రమోన్నతి జెందుచు జీవించినప్పుడే, మానవుడు సంపూర్ణవికాసము గాంచగల డని నిరూపించి యుపనిషత్తులు జీవనమున నొక గభీర సమన్వయమును నెల

1. మర్త్యం వా ఇదం శరీరం, ఆత్తం మృత్యునా;
తదస్యా మృతస్యా శరీరస్యాత్మ నోధిష్ఠానం.
చాందోగ్యోపనిషత్తు VIII-12-1.

కొల్పెను.[1] కేవలైహికజీవనమె సర్వమని తలంచి యందు నిమగ్నులయి యుత్తమధార్మికజీవనము బడయు నాకాంక్ష లేని వారికి "ధర్మం చర...ధర్మాన్న ప్రమదితవ్యమ్"[2] అని యుపనిషత్తు ఆదేశ మొసంగుచున్నది. కాని ఈశ్వరప్రేరితు లగుచు ప్రాపంచికజీవనము శ్రద్ధతో గడపుటయే మానవుల కాదర్శముగ జూపబడెను. "ప్రపంచమునే సేవించువారు కారు చీకటియందు ప్రవే

1. Man is higher than all other aspects of the universe, and his destiny realised when he becomes one with the infinite. Nature has life concealed in it, and when life develops, nature's destiny is fulfilled. Life has consciousness concealed in it, and when it liberates consciousness, its end is reached. The destiny of consciousness is fulfilled, when intellect becomes manifest. But the truth of the intellect is reached, when it is absorbed in the higher intuition which is neither thought nor will nor feeling, but yet the goal of thought, the end of will and the perfection of feeling. When the finite self attains the supreme, the god head from which it descended, the end of spiritual life is reached.

*S. Radhakrishnan: Indian philosophy Vol, I—p. 206.*

2. తైత్తిరీయోపనిషత్తు I-11.

శింతురు; పరమేశ్వరునియందే లగ్నమయినవారు అంతకంటె నెక్కువచీకటిలో ప్రవేశింతురు."[1] "ఏకకాలము సనె పరమేశ్వరుని ప్రపంచము ననుసరించువాడు ప్రపంచముద్వారా మృత్యువును జయించి పరమేశ్వరుని మూలమున అమృతత్వము బడయును."[2] ప్రాపంచిక కార్యములందు పరమేశ్వరసాన్నిధ్యానుభవముబడయుటే యుత్తమ ధర్మసాధనగా కనపరచి కర్మనిరతు లయి యాధ్యాత్మికజీవనము లేక పరస్పరవిద్వేషములందు దగుల్కొని శాంతిశూన్య మగు శుష్కస్వార్థజీవనము గడపుచుండిన నాటి జనులందు నావశ్యకమయిన చిత్తసంస్కారము కలిగించుటకు తోడ్పడిన యుపనిషత్సమన్వయము అత్యంతశ్లాఘాపాత్రము. "ఎవ్వని తెలిసికొనజాలక

1. అన్ధం తమః ప్రవిశన్తి యే అసంభూతి ముపాసతే.
తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాం రతాః
ఈశోపనిషత్తు 12.

2. సంభూతిం చ వినాశం చ యస్తద్వేదోభయం సహ
వినాశేన మృత్యుం తీర్త్వా సంభూ త్యామృత మశ్నుతే.
ఈశోపనిషత్తు 14.

మాటలె గాక మనస్సు కూడ మరలివచ్చునో యా పర బ్రహ్మముయొక్క యానందము ననుభవించినవాడు ఎప్పుడును భయపడడు; ఎద్దానికిని భయపడడు."[1] మన స్సుకంటె సూక్ష్మతరమైన విజ్ఞాన నేత్రము తెరచి మాన వులు బ్రహ్మసాక్షాత్కారము బడసి నిర్భయమైన యుత్తమజీవనము గడపుటకు నుపనిషద్బోధ యెంతయు నుపకరించును.

## భగవద్గీతా సమన్వయము

ఉపనిషత్కాలము తరువాత నుపనిషత్తులు బోధిం చిన బ్రహ్మజ్ఞానము విస్మరింపబడెను. వేదయుగము గడచినతోడనె వర్ణభేదము వికృతరూపము దాల్చి యన

1. యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచనేతి.
తైత్తిరీయోపనిషత్తు II-4.
యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చనేతి.
తైత్తిరీయోపనిషత్తు II-9.

ర్థదాయకమయినటులనె, ఉపనిషద్యుగము ముగియ
గానె వర్ణభేదమువలని యరిష్టములతో సూత్రయుగ
మున తిరిగి సంకుచితజీవనము విస్తరించెను. గృహ్యసూ
త్రములు, ధర్మసూత్రములు మొదలయినవి రచించుచు
బ్రాహ్మణులు తమ వర్ణమునందు కొన్ని యుత్తమము
లయిన సాంఘికనియమములు, జీవనవిధులు మున్నగు
కట్టుబాటులు ప్రవర్తిల్లజేసిరి; కాని బహుదేవతల నారా
ధించుచు సంకీర్ణధర్మమున తగుల్కొనిరి. కర్మకాండ
హెచ్చెను. కులకట్టుబాటులు పాటించుట నీతి యయ్యెను.
బాహ్యనిష్ట మోక్షసాధనముగ పరిగణింపబడెను. కొన్ని
యున్నత నూతనధార్మికభావములు సూత్రయుగములో
వెలువడినవి; కాని యా కాలమున దేశము అజ్ఞానతిమి
రముచే నావరింపబడెను. ఇది పటాపంచలు చేయుటకు
గౌతమబుద్ధుడును మహావీరుడును పాటుపడిరి. ఉపనిష
త్తుల పేరు చెప్పకపోయినను అవి బోధించిన పద్ధతినె
గౌతమబుద్ధుడు ధర్మమును విపులార్థమున ప్రచారము
చేసి జనులు యథార్థనీతివర్తను లగుటకు తీవ్రముగ
పాటుపడెను. అతని ప్రయత్నములు కొంతవరకు ఫలిం
చెను. "అప్పటికి కొలదిపండితులు మాత్రము గ్రహించి

యున్న యుపనిషద్విజ్ఞానము ప్రజాసామాన్యమునకు లభింప జేయుటకు బౌద్ధధర్మము సాయపడెను."[1] ప్రజ లనేకులె గాక తుదకు చక్రవర్తులు సయితము బౌద్ధ ధర్మ మవలంబించిరి. మౌర్యసామ్రాజ్యప్రతిభ కాచక్రవర్తులు కనపరచిన యౌదార్యమె కారణము. కాని కాలక్రమ మున బౌద్ధులలో ధర్మము క్షీణించెను; మూఢత్వము తల యెత్తెను. బుద్ధునకును ఆతని ప్రథమ శిష్యులకును గల ధర్మోత్సాహము వారి తరువాతి యనుచరులలో తగ్గెను. బౌద్ధసంఘమున సర్వమానవులు చేరుట కవకాశ ముండుటచే, సామాన్యమూఢజనులు కూడ నందు ప్రవేశించి నికృష్టాచారములు వ్యాపింప జేసిరి. బౌద్ధభిక్షువుల సన్యాసజీవనము విజ్ఞానవంతులకు వెగటుగా నుండెను. వేదములందు ప్రభవించి యుపనిషత్తులందు విస్తృతి గాంచి వంశపారంపర్యముగ వచ్చుచుండిన ధర్మధారను త్రెంచుటకు బౌద్ధసంప్రదాయము యత్నించెను. ధర్మజ్ఞ

1. Buddhism helped to democratise the philosophy of the Upanishads, which was till then confined to a select few.

*S. Radhakrishnan: Indian philosophy. Vol. I. P. 471*

లది సహింపకుండిరి. అడ్డు లేర్పడిన, వానిని దొలగించుచు ధర్మవాహిని నిరంతరాయముగ ప్రవహింప జేయుట విధాయకము గదా? పూర్వజ్ఞాన మెప్పటి కప్పుడు తుడిచి వైచినచో, మానవాభివృద్ధి సున్న యగుటకు సంశయ మేమి? మహావీరుని యుద్యమము కొంత ప్రయోజనకరముగ నుండి నేటివరకును దేశములో నిలచి యున్నను, ప్రచారము లేక కొలదిమందిలో నిబద్ధమై యప్పటి దుస్థితి తొలగింప జాలకుండెను. దేశములో నొక వంక వ్యాప్తము లై యున్న మూఢాచారము లకును శుష్కకర్మకలాపములకును దోడుగ నింకొక వంక నాస్తికజీవనమును పామరత్వమును చెలరేగెను. కర్మ నిమగ్నతకు ఫలాపేక్షయు, అహంకారమునకు కర్తృత్వ బుద్ధియు, నాస్తికత్వమునకు స్థూలదృష్టియు కారణములు. ప్రతిమనుష్యు డేవో కొన్ని కార్యములు చేయక తప్పదు. జీవనలక్షణమె కార్యముల నిర్వహించుట. కాని యవి మానవునకు సహజములుగ నుండవలెను. అప్పు డవి సులభముగను నిరాడంబరముగను గావింపబడును. విత్తనము మొలకెత్తి వృక్ష మయి ఫలపుష్పముల నొసంగు నప్పుడు కాన్పించెడు స్వాభావికవికాసము మానవుని

నుండి కూడ వెలువడవలెను. వాడు స్వశక్తులకును అభిరుచులకు ననుగుణముగ కార్యములు సలుపునెడల, అవి రమణీయము లయి శుభకరములుగ నుండును. ఫలాపేక్ష వాని స్వభావమునకు విరుద్ధముగ వానిని నడపి కృత్రిమ జీవనము వర్ధిల్ల జేయును. ఆ జీవనము దుఃఖభూయిష్ఠ మై బాధకరముగ నుండును. ఉత్సాహపూరిత మగు సహజ జీవనము నిష్కామకర్మమువలన జనించును. మనుష్యుడు ఫలమును కోరుకొనకయే కర్మను చేయవచ్చును; కాని కర్తృత్వము తన కారోపించుకొనునెడల సహంభావపూరితు డై యితరుల హీనముగ జూచును. అట్టి వాని మూలమున బహుజనుల కపకారము కలుగును. వాడు తన పురోవృద్ధిని భంగపరచుకొనును. వాడు పృధివిపై జన్మించుటకు గాని సద్బుద్ధిని కలిగియుండుటకు గాని ధర్మకార్యముల నిర్వహించుటకు గాని తానె కారణుడు గాడు. నీటిజల భూమినుండి యుద్భవిల్లి ప్రవహించునట్లు ప్రతిమానవుని జీవితము పుడమిపై జనించి వృద్ధిజెందు చున్నది. కనుక మానవుడు కర్తృత్వము విడనాడవలెను. కర్తృత్వ విసర్జనముతో సులభముగ నిగర్వి యయి నిరంతరాభివృద్ధి జెందగలడు. సర్వజీవులును

నమ స్తసృష్టియు నెవ్వని మహాశక్తివలన ప్రభవించి పోషింపబడు చున్నదో యా పరమేశ్వరుని నాశ్రయించి జీవించుటమూలమున మానవుడు అహంకారము విడిచి నిష్కామబుద్ధితో కర్మముల నాచరించుచు పవిత్ర జీవనమున దినదినాభివృద్ధి గాంచుట సహజము. కావున కార్యములందు నిష్కామ్యతయు, జ్ఞానమునందు నిరహంకారమును వహించుటకు మానవుడు భగవదాధీను డగుచు నిర్మలభక్తి నలవరచుకొనవలె నని యుద్బోధించుటకు, సూత్రయుగ వైపరీత్యము గాంచిన ప్రాజ్ఞులు ప్రయత్నించిరి. భగవద్గీత యట్టితరి వెలువడిన యొక యుద్గ్రంథము. కర్మమునకును, జ్ఞానమునకును, భక్తికిని గల పరస్పరసంబంధము జూపి ధర్మజీవనము శుష్కకర్మ మునందు గాని మెట్టవేదాంతమునందు గాని మూఢ భక్తియందు గాని లేదని నిరూపించి జ్ఞానభక్తికర్మమార్గ ములకు భగవద్గీత సమన్వయము చేకూర్చెను. "ఎవరు నాయందు భక్తి గలిగి హృదయపూర్వకముగ నన్ను భజించెదరో వారికి నన్ను పొందగల నిశ్చలజ్ఞానము ప్రసాదించెదను. వారియెడ నవ్యాజప్రేమ గలిగి వారి హృదయములందు నేను వసించి ప్రకాశమాన మగు

విజ్ఞానదీపముచే నజ్ఞానాంధకారము పారద్రోలుదును."[1] అని శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో అర్జునున కొసంగిన యభయదానము యథార్థధర్మజీవమునకు నిశ్చయముగా ప్రాతిపదికము. నిశ్చలభక్తి విజ్ఞానమును, విజ్ఞానము జీవనపథమును, బడయజేయు నని బోధించి భక్తి, జ్ఞానము కర్మము అను నీ త్రివాహినులను సంగమింప జేసి యొక యుత్తమసమన్వయము స్థాపించుటచే భగవద్గీత హిందువుల పవిత్రగ్రంథములలో నొకటి యగుటకును అన్య దేశస్థులచే గూడ ప్రశంసింపబడుటకును నర్హ మయ్యెను. భగవద్గీతాబోధవలన హిందువులందు మరల నవజీవన ముద్భవించి దేశాభ్యున్నతి చేకూరెను.[2] భేదభావ

1. తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్,
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే.
తేషా మే వానుకంపార్థ మహ మజ్ఞానజం తమః,
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా.
భగవద్గీత. X-10, 11.

2. The author of the Bhagavadgita, with true speculative insight and synthetic power, initiates a new philosophical and religious synthesis which forms

ములు లేక వివిధమానవులు పరస్పరమైత్రితో సోదరులవలె మెలగుటకును, ప్రతిమానవుడు క్రమముగ సంపూర్ణాభివృద్ధి నొందగలుగుటకును ఆర్యులచే కనగొనబడిన సమన్వయసూత్రములు జనసామాన్యమునందు వ్యాపింపజేయుటకై మొదట భారతరామాయణేతిహాసములు పండితులు రచించిరి. మహాభారతము వట్టి చారిత్రిక గాధనె తెలుపుచుండినను, అది నీతిబోధకమును ధర్మప్రదాయకము నగు నుత్తమ సమన్వయ గ్రంథముగ [1] పెంచబడెను. అందలి యొక పట్టున భగవద్గీత చేర్చబడెను. అటుపిమ్మట వేదమునందును ఉపనిషత్తులందును భగవద్గీతయందును గల యుత్తమజ్ఞానము విచిత్రవర్ణనములతోను అద్భుతకధలతోను గూడిన విష్ణుపురాణము, భాగవతము మున్నగు పురాణములద్వార

the background of the theistic systems of a later days.
*S. Radhakrishnan; Indian philosophy, Vol. I. P.481.*

1. The Bharata is the first attempt at affecting a reconciliation between the culture of the Aryans and the mass of fact and fiction, history and mythology which it encountered.
*S. Radhakrishnan; Indian philosophy. Vol. I. P. 480*

మున సామాన్యజనులకు లభింపజేయబడెను. దేశము నందు పండితులకును పామరులకును కూడ ధర్మప్రబోధము కలిగి యైకమత్య మేర్పడి మునుపెన్నడు లేని మహాసంఘశక్తి వెలువడెను. సాంఘికోపాసనకొరకు భక్తకూటములు వెలసెను. సాధారణజనోద్ధరణమునకై దేవాలయములు నిర్మింపబడెను. దైవభక్తియు సంఘీభావమును ప్రబలుచు హిందూధర్మము మహోచ్ఛస్థితి నందెను. బుద్ధుడు బోధించిన యుత్కృష్టాదర్శముల స్వీకరించి బుద్ధుని నవతారపురుషునిగ గైకొని యా కాలమున హిందూధర్మము కనపరచిన సమన్వయ సామర్థ్య మెంతయు నాశ్చర్యకరము. హిందూదేశములో బౌద్ధమతము ప్రత్యేకముగ వర్ధిల్లుట కవకాశము లేక పోయెను. దాని కేంద్రస్థానము హిందూదేశమునుండి చైనాదేశమునకు పూర్వవలసి వచ్చెను. రాజకీయాన్నత్యము కూడ దేశమునకు సమకూరెను. గుప్త సామ్రాజ్యము ప్రతిష్ఠింపబడెను. దానికి చాల సామంత రాజ్యము లేర్పడెను. నలందపరిషత్తు స్థాపింపబడెను. భాసకాళిదాసాది కవీశ్వరులు, దండిబాణాది గద్యరచయితలు, ఆర్యభట్ట బ్రహ్మగుప్తాది శాస్త్రజ్ఞులు, శిల్ప

నాట్యాదికళాప్రవీణులు, భక్తిపుంగవులు వివిధమార్గముల దేశాభివృద్ధిని సూచించు మహాపురుషులై విలసిల్లిరి. సిరియాదేశపు క్రైస్తవులు తమదేశమున బాధింపబడి హిందూదేశము నాశ్రయించి సుఖజీవనము బడసిరి. ఇట్లు సర్వతోముఖముగ హిందూదేశము వర్ధిల్లి ఆసియాఖండములో నగ్రస్థానము వహించి యావత్ప్రపంచమున మొదటి నాగరిక దేశముగ ప్రఖ్యాతి గాంచెను.

## తాంత్రిక సమన్వయము

ఈ యున్నతస్థితినుండి కొన్ని శతాబ్దములపిమ్మట పతనము తిరిగి ప్రారంభ మయ్యెను. విదేశీయులు పలుపురు దేశములోనికి వచ్చుటవలనను, దేశమునందైకమత్యము లేకపోవుటవలనను సంఘము తిరిగి పతనము జెందెను. పూర్వపుటౌన్నత్యము నెలకొల్పుటకు పునఃప్రయత్నము జరిగెను. తాంత్రికసాధకులు ధర్మోద్ధరణమునకు గడంగిరి. అన్యజాతులతోడి సంఘర్షణములు, జీవితమున సంప్రాప్తము లయ్యెడు దుఃఖములు, నష్టములు మున్నగు బాధలవలన జనులు నిరాశ జెందుచుండిరి. సుఖమునందె

గాక దుఃఖమునందును, శుభమునందె గాక యశుభము
నందును, మిత్రత్వమునందె గాక శత్రుత్వమునందును
ఈశ్వరసందర్శనము చేయగలిగి నప్పుడు గాని మానవుడు
సమనస్కుడై ప్రశాంతముగ జీవింపనేరడు. కావున
తాంత్రికసాధకులు ప్రపంచవినాశహేతువు లగు భూకం
పములు, తుపానులు, వ్యాధులు మున్నగు బాహ్యావిప
త్తులనుండియు కామక్రోధాది మానసిక ప్రవృత్తులనుం
డియు దూరముగ తొలగక వానియన్నిటియందు ఈశ్వ
రసంకల్పములనె గాంచుచు భగవద్భక్తిని పెంపొందించు
కొనిరి. తత్సాధన గరపు మహానిర్వాణము, కులార్ణ
వము మొదలగు తాంత్రికగ్రంథములు రచించిరి. భీక
రత్వముతో విలయమునను, వ్యామోహముతో ప్రలో
భనమునను ప్రత్యక్షమగు శక్తిస్వరూపమునందు మాతృ
వాత్సల్యము గ్రహింపబడెను. కామిను లెల్లరు జగన్మాత
యొక్క విభిన్నమూర్తులుగ దర్శింపబడెను. భయంకర
కాళీదేవియె మాతృదేవిగా పరివర్తన మొందింపబడెను.
"భయానాం భయం, భీషణం భీషణానాం; గతిః ప్రాణి
నాం, పావనం పావనానాం; మహోచ్చైఃపదానాం నియన్తృ

త్వమేకం; పరేషాం పరం, రక్షకం రక్షకాణాం"[1] అనునది యుపాసనా మంత్రముగ మహానిర్వాణతంత్రము వెల్లడించెను. పరమేశ్వరుడు అతిభయంకరుడు, అతిభయానకుడు; కాని యాయనే జీవులకు గతి, పరమపావనుడు. సర్వోన్నతపదవుల నియమించు వాడు ఆయన యొక్కడే. ఆయన సర్వశ్రేష్ఠుడు, మహారక్షకుడు. ఇట్టి దృఢవిశ్వాసము జనులయందు పాదుగొల్పుటకు ప్రయత్నింపబడెను. దేశమునందు నిశ్చలభక్తియు, శోధనలను వ్యామోహములనుఅతీతింపగల సమన్వయబుద్ధియు పొడసూపి హిందూధర్మము మరల శక్తివంత మయ్యెను. ఈ కాలమున విదేశస్థు లనేకులు హిందూధర్మమున స్థానము బడసిరి. వైష్ణవ, శైవ, శాక్తేయ సాధనలు ప్రబలెను. శంకరుడు, రామానుజుడు, నీలకంఠుడు తమ యద్భుత తత్త్వసిద్ధాంతముల ప్రకటించిరి. అద్వైతప్రతిపాదకుడై శంకరుడు నాడు కనపరచిన సమన్వయసామర్థ్యము వర్ణనాతీతము. విక్రమశిలాపరిషత్తు ప్రతిష్ఠింపబడి తాంత్రికవిజ్ఞానమునకు కేంద్రస్థానమయ్యెను. పారశీకులు స్వదేశమునుండి

1. మహానిర్వాణతంత్రము III-61.

తరుమబడి హిందూ దేశమున శరణ్యాముబడసిరి. జీవితమం దలి సమస్తావస్థలు ఈశ్వరలీల లని తాంత్రికులు చెప్పుటచే సమగ్రమగు ధర్మసమన్వయము చేకూరెను. తాంత్రికసమన్వయమె పురాణగాధలందలి భావగభీరతకు తోడ్పడెను. హఠ రాజయోగసాధనలకు కారణ మయ్యెను. దేశమందు ధర్మజీవనము తిరిగి వికాసము గాంచెను.

### మధ్యమయుగ సమన్వయము

ధర్మ మెప్పటికప్పుడు కాపాడబడుచుండినను, విదేశీయులు తండోపతండములుగ దేశములోనికి గ్రుమ్మరుచు ధర్మసమస్యను మరలమరల క్లిష్టపరచిరి. మహమ్మదీయ దండయాత్రలు ప్రారంభమై దేశమున సంక్షోభము బయలుదేరెను. ప్రాణధనమానములకు రక్షణము లేక పోయెను. హిందూదేవాలయములు ధ్వంసము చేయబడెను. హిందువులు పలువిధముల బాధింపబడిరి. ఈ మహావిపత్తునందు వారు ఆత్మసంరక్షణార్థము కొన్ని సంకుచితపద్ధతు లవలంబించిరి. బాల్యవివాహములు ప్రారంభించిరి. కులకట్టుబాటులు దృఢపరచిరి. అందువలన వికా

సించిన జీవనము తిరిగి చాల ముకుళిత మయ్యెను. ఈ మధ్యమయుగములో మతసాంఘిక రాజకీయాది సర్వవిషయములందు హిందువులు హీనస్థితికి వచ్చిరి; కాని యుత్తమధార్మికభావము మహనీయుల హృదయములందు దాగియే యుండెను. బాహ్యజీవనములో ననేక సమయములందంతరాయములు కలుగుచుండినను, ధార్మికభావము మాత్రమేకధారగ హిందూదేశమున ప్రవహించె నని చెప్పకతప్పదు. మహమ్మదీయులు భగవంతు డొక్కడని ధృఢముగ నమ్మెదరు. ఆతడు సర్వనియంతయై మానవుల శాసించును గాన, ఆతని యాజ్ఞానువర్తులై ప్రభువును సేవకు లనుసరించులాగున మానవులు మెలగవలయు నని మహమ్మదీయులు చెప్పెదురు. వారు ఈశ్వరుని సర్వాతీతునిగ గ్రహింతురు. కాని హిందువులు ఆతనిని సర్వాంతర్యామిగ దర్శింతురు. సృష్టిలోని బహుత్వమునందు నేకేశ్వరుని గాంచునప్పుడు ఆతని యేకత్వమునుండి మానవునిదృష్టి మరలి బహుత్వమున తగుల్కొని బహుదేవతారాధన వెలయుట తటస్థించును. ఈశ్వరుని విశ్వాతీతునిగ భావించువారలకు నిట్టి భ్రాంతి కలుగనేరదు; కాని వా రీశ్వరునితో ప్రత్యక్ష

సన్నిహితసంబంధము బడయ జాలరు. పరమేశ్వరుని యేకత్వమునకు భంగము కలుగనీయక సకలవిషయము లందాయన సాక్షాత్కారము బడయుట కర్తవ్య మని నాటి హిందూ మహమ్మదీయ సంఘర్షణ ద్వారమున హిందూసాధకులును మహమ్మదీయభక్తులును బాగుగ గుర్తించిరి. అనేకత్వమునం దేకత్వము దర్శింపగల దృష్టి జనులకు లభించినయెడల, వారు యదార్థదైవభక్తులును అన్యోన్యమిత్రులును ఏకవిశ్వకుటుంబీకులును కాగల రని వారు తెలిసికొనిరి. వారిలో రామానందుడు, కబీరు, చైతన్యుడు, నానకు, దాదు, నామదేవు, తుకారాము, రామదాసు ముఖ్యులు. వారి కృషిమూలమున హిందువులకును మహమ్మదీయులకును సఖ్యత సమకూరెను. "ప్రపంచమున రూపసౌందర్యమును జీవకళను చూచి నప్పుడు, ప్రపంచము నాకు భిన్నమగు రూపముతోను జీవముతోను పొడగట్టును. కాని బ్రహ్మముగ దర్శించి నప్పుడు, దానిని వర్ణించుటయె నాకసాధ్యము. సంబంధ భావము బహుత్వమును, ఆత్మభావము ఏకత్వమును ప్రత్యక్షము చేయును. బ్రహ్మసాక్షాత్కార మైనప్పుడు, నా దృష్టి బ్రహ్మదృష్టి కూడ నగును. ఇట్టి దృష్టిసమ్మే

శనమునందు సత్యము ద్యోతమగును."[1] అని దాదు భక్తపుంగవుడు బోధించినటులనె యీ కాలపు సకలేతర సమన్వయకర్తలు బోధించి భేదమున అభేదమును దర్శించుసాధనను జనులలో వ్యాపింపజేసిరి. కొందరు మహమ్మదీయచక్రవర్తులు సయితముదారస్వభావమును మతసహనమును బడయ గలిగిరి. మొగలాయిచక్రవర్తి యగు బాబరు తన పుత్రుని నుద్దేశించి మరణశాసనములో నిట్లు వ్రాసెను. "హిందూదేశములో ననేకమతావలంబకులు గలరు. ఈ దేశపరిపాలనము రాజాధిరాజగు భగవంతుడు నీ కనుగ్రహించెను. కావున కృతజ్ఞుడ వయి

1. When I look on creation as beauty of form, I see only form and beauty. When I look on it as life, everywhere I see life. When I look on it as Brahma, then indeed is *Dadu* at a loss for words. When I see it in relation, it is of bewildering variety. When I see it in my own soul, all its variousness is merged in the beauty of the Supreme Soul. This eye of mine then becomes also the eye of Brahma, and in this exchange of mutual vision does *Dadu* behold Truth. —*Dadu.*

***(From an article by Prof. Kshiti Mohan Sen in the 'Visvabharati')***

యుండుము. నీ విధికృత్యముల గమనింపుము. నీ రాజ్యములోని జనుల మత విశ్వాసములను ఆచారములను సన్మానించుచు నిష్పక్షపాతముగ వారెల్లరికిని న్యాయము కలుగ జేయుము ...... ఏ మతమువారి దేవాలయములను ప్రార్థనమందిరములను నాశము చేయకుము."
గోమాంసభక్షణము మాని గోహత్య నిషేధించిన మహమ్మదీయచక్రవర్తులు కొందరు గలరు. జహంగీరు దర్బారునందు నొక హిందూయోగి గౌరవింపబడుచుండెను. షాజహాను యొక్క పెద్దకుమారుడును పెద్దకుమార్తెయు వేదాంతశాస్త్రము బాగుగ పఠించిరి. అక్బరు హిందూమహమ్మదీయసమ్మేళనమునకు బహుభంగుల పాటుపడెను. మహమ్మదీయయుగములో కూడ సమన్వయజీవనము వర్ధిల్లెను; కాని ఐరోపాదేశస్థులు క్రొత్తగా దేశములోనికి వచ్చి రాజ్యముల స్థాపించిరి. మహమ్మదీయులతోడనె గాక వెంటనె పాశ్చాత్యులతోడను సంఘర్షణము ప్రారంభమాయెను. నవయుగమున ప్రాక్పశ్చిమనాగరకతా సమన్వయము కూడ గావించుట యావశ్యకమయ్యెను.

## భారతచరిత్రాధిక్యత

ఈ నవయుగసమన్వయమునకుగూడ హిందూదేశము పూనినది మొదలు, అది యావత్ప్రపంచవాసుల దృష్టి నాకర్షించినది. వారు భారతవర్షము సర్వ దేశస్థుల శ్రేయమునకు తోడ్పడు సందేశ మొసంగ గల దని యాశించుచున్నారు. అధోగతి జెందియున్నను భారతవర్షము ఈ కాలములో కూడ నిట్టి మహాగౌరవ మునకు పాత్రమయ్యె ననిన నాశ్చర్యము గాదా? రాజకీయముగను, ఆర్థికముగను, సాంఘికముగను భారతవర్షము తిరిగితిరిగి నష్టము పొందుచునె యుండెను. ఆ విషయములకు సంబంధించిన చరిత్ర పతనాభ్యుదయములతో కూడి యుండెను. కాని హిందూదేశముయొక్క యాధ్యాత్మిక చరిత్రము క్రమోన్నతి జెందెను. "హిందూదేశచరిత్రలో ముఖ్యమయిన భాగము, అది గాంచిన జ్ఞానవికాసము తెలుపు చరిత్రమె."[1] అని సుప్రసిద్ధ చరిత్రకారుడు

1. The most important branch of Indian History is the history of her thought.

*Vincet Smith*

విన్ సెంటుస్మిత్తు చెప్పిన మాట యెంతయు సత్యము. నవ యుగమున భారతవర్షము మేల్కాంచె నని జయగానము చేయుచున్న విశ్వకవి రవీంద్రుడు హైందవధర్మజీవన మును గూర్చి యెట్టి విశ్వాసపూరితమగు నభిప్రాయము వెల్లడించుచున్నాడో యాలకింపుడు. "భారతవర్షము క్రొత్తక్రొత్త సంఘాతముల ప్రబలాఘాతముల నెన్నియో సారులు భరించె నని చరిత్రవలన తెలియగలదు. కాని చందనతరువును గొట్టినకొలది నది సుగంధము నధికతర ముగ వెదజల్లును; అటులనె భారతవర్షము గొప్ప సంఘర్షణములకు లోనైనప్పు డెల్లను తన సత్యసంధతను బ్రహ్మ సాధనను అన్నిటికంటె నెక్కుడుగ నవ్యతరరూపములతో వెలువడ జేసెను. అట్లు గావించి యుండనిపక్షమున భారతవర్షము తనను కాపాడుకొన లేకపోయెడిది."[1] యుగ యుగములనుండి హైందవధర్మవాహిని యెట్లు తెంపు లేకుండ ప్రవహించుచు వచ్చెనో యీ ప్రకరణమున చూపబడెను. ప్రపంచమున రోమనులనాగరికతయు గ్రీకుల నాగరికతయు పూర్వ మొకప్పు డెంతో ఘనత

1. శాంతినికేతన సంపుటము XIII-పుట 102.

జెందినను ప్రస్తుతము పూర్తిగ నంతరించినవి. హైందవ విజ్ఞానము వేదకాలమునుండి నేటివరకు చిరనూతనవికాసముతో తేజరిల్లుచున్నది. ప్రకృతము మరల మహాసమన్వయోద్యమమునకు హిందూదేశము గడంగినది. భారతీయులు తమ లోపములను దోషములను గాంచి సామాన్యముగ నిరుత్సాహము జెందుదురు. వారు తమ దేశమందలి ధర్మవికాసమును జూచి ధైర్యము వహింతురుగాక! "ఎవ రేప్రకారముగ నన్ను ఉపాసించుచున్నారో నేను వారలను ఆలాగుననె యనుగ్రహించు చున్నాను. నా మార్గమును మానవులు సర్వ విధానములచేతను అనుసరించు చున్నారు."[1] అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు భగవద్గీతయందు జేసిన యుపదేశమువంటి యుత్కృష్టవచనములు నేటికిని నాదర్శ సూత్రము లై హైందవు లనుధర్మజీవనమున ముందునకు నడపుచున్నవి. వా రనుదినసంధ్యావందనమునందు "ఆకాశమునుండిపడెడు

1. యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం,
మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః
భగవద్గీత IV-11.

వర్ష ధారలన్నియు సముద్రము నేవిధముగ జేరుచున్నవో ఆ విధముగనె సర్వదేవ నమస్కారములు ఏకేశ్వరునికి జెందుచున్నవి.''[1] అని స్మరించు మంత్రము పూర్తిగ హృద్గతము చేసికొనిన యెడల, వారు మరల నవతేజముతో విలసిల్లుచు తమయందు నుత్తమ సమన్వయ జీవనము తప్పక పెంపొందించుకొన గలరు. నవయుగసమన్వయమును పరిశీలించుటకు పూర్వము, అది యెట్టి పరిస్థితులందు నెలకొల్పబడుచున్నదో వానిని విచారించుట యావశ్యకము. అవి రాబోవు ప్రకరణమున వివరింపబడును.

1. ఆకాశా త్పతితం తోయం యథాగచ్ఛతి సాగరమ్,
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి.
సంధ్యావందనము.

పాశ్చాత్యుల యాగమనము

భారతీయుల దౌర్బల్యము

అనుకరణ జీవనము

భౌతిక విజ్ఞానము

యంత్రాలయ నిర్మాణము

ధనారాధనము

జాతీయ భావము

సమత్వ సిద్ధాంతము

ఆత్మశక్తి పరిభావము

ప్రస్తుత కర్తవ్యము

## నవయుగ వాతావరణము

మహమ్మదీయసంఘర్షణఫలిత మయిన యశాంతి నుండి తెప్పరిల్లకముందె పాశ్చాత్యులతో కూడ సంఘర్షణము ప్రారంభ మై భారతదేశము మరింత యశాంతి యందు మునిగెను. పూర్వ మొకప్పుడు ఆర్యులు ఉత్తర హిందూస్థానము నంతయు నాక్రమించి దక్షిణహిందూస్థానమునందును జొచ్చి గొప్ప రాజ్యములు స్థాపించి మహాపట్టణముల నిర్మించి బాబిలోను, ఈజిప్టు, గ్రీసు మున్నగు విదేశములతో వర్తకము జరపుచు నైహిక జీవనమందును, ఆముష్మికజీవనమందును నచ్ఛదశలో నుండగా, ఐరోపాఖండవాసు లగు గ్రీకులు హిందూదేశముపై దండెత్తి వచ్చి పంజాబుప్రాంతములందు స్వల్ప కాలము పరిపాలనము సాగించి తుదకు దానిని నిలుపు కొన జాలక దేశమును విడిచి వెళ్లిరి.

## పాశ్చాత్యుల యాగమనము

అటుపిమ్మ టనేక శతాబ్దములవరకు పాశ్చాత్యులతో హిందూదేశమునకుమరల సంపర్కము కలుగ

లేదు. పోర్చుగీసువారు, ఫ్రెంచివారు, బ్రిటిషువారు దేశమునందు క్రమక్రమముగా నొకరి తరువాత నొకరు ప్రవేశించి మొదట కొంతకాలము వర్తకము జేయుచు చివరకు హిందూ రాజులను మహమ్మదీయ నవాబుల నోడించి రాజ్యముల స్థాపించుకొనిరి. వా రొకరిని మించి యొక రధికు లగుటకు పరస్పర యుద్ధములందు తగుల్కొనిరి. ఆ సంగ్రామముల పర్యవసానముగ బ్రిటిషువారు యావద్భారతవర్షమున కును పరిపాలకు లైరి. ఇతరపాశ్చాత్యులు కొలది పట్టణ ములందు మాత్రము తమ ప్రభుత్వము నిలుపుకొనిరి. స్వదేశప్రభువుల పరిపాలనము దాదాపుగ నంతటను సం పూర్ణముగ నంతరించెను; మిగిలిన చోట్ల నామమాత్ర ముగ మిగిలెను. జర్మని, అమెరికా మొదలగు దేశముల లోని యితరపాశ్చాత్యులు కూడ వర్తకముకొరకు గాని క్రైస్తవమతప్రచారమునకుగాని హిందూదేశమునందు ప్రవేశించి నివాస మేర్పరచుకొనిరి. పాశ్చాత్యులు తమ యాధిక్యతను సర్వవిధముల స్థాపించుకొనుచు విజృంభించు టచే భారతీయులు చాల యొత్తిడికి లోనగుచు కలత

జెందిరి. ఆ కలవరమువలననే భారతీయధీశక్తి మరల మేల్కాంచి నూతన జీవనముతో నవయుగమున తలయెత్తెను.

## భారతీయుల దౌర్బల్యము

కాని నవయుగారంభము నాటికి భారతజాతి యెట్టి హైన్యత జెందెనో దానిని బాగుగ ముందు గుర్తించుట యావశ్యకము. భారతవర్ష మతివిస్తీర్ణ మయినది. ఒక్క రష్యాను విడిచిన యెడల మిగిలి యుండు ఫ్రాంసు, ఇటలి, జర్మని మున్నగు దేశము లన్నిటితో కూడియున్న ఐరోపాఖండ మంత పెద్దది. భారతవర్షమును ఒక దేశ మనుటకంటె నొక ఖండ మని పిలుచుట యెక్కుడు సమంజసము. అందు ఆదిమనివాసు లనేకులు గలరు; విదేశీయులు పలువురు జేరుచు వచ్చిరి. ఈ వివిధజాతులవారందరిని నేక హైందవనాగరికతలోనికి దెచ్చి పరస్పరమైత్రియందు గూర్చి యొక మహాహిందూజాతిగ పరిణమింప జేయుట కెంతయో కృషి మొదటినుండియు జరుగుచునె వచ్చెను గదా? కాని యీ యుద్యమము మరల

మరల స్వార్థపరు లగు అగ్రవర్ణములవారి మూలమున
భంగపరుపబడెను. శక్తివంతులు నాయకు లగుట సహ
జము. కాని వారు స్వార్థమును త్యజించి న్యాయశీలురును
ప్రేమస్వభావులు నయి సేవాపరాయణులుగ వర్తించు
నంతకాలము జాతియం దైకమత్యము, శాంతి, ఉన్నతి
చేకూరును. అట్లు గాక వా రెప్పుడు తమ యాధిక్యతకై
గర్వించి యధికారదృష్టితో తమతోడివారిని హీనముగ
జూచుచు వారిని నణగ ద్రొక్కుటకే తమ శక్తి నుప
యోగింతురో, అప్పుడు జాతిలో ద్వేషములు, కలహ
ములు, బలహీనత వృద్ధి జెందును. బ్రాహ్మణులు జ్ఞాన
ముచేతను, క్షత్రియులు బాహుబలములచేతను, వైశ్యులు
ధనముచేతను అధికు లై యుండిరి. సంఘపురోవృద్ధికి
పాటుపడవలసిన యగ్రవర్ణములవారె గర్వాంధులును
చండశాసనులు నయి యొకరి కొకరు తోడగుచు దేశ
మున కరిష్టము పలుమారులు కలిగించిరి. ఉన్నతశ్రేణు
లకు జెందినవారు నిమ్నశ్రేణులవారిపై నధికారము
చెలాయించుచు తమ సంకెలలను తామె నిర్మించుకొనిరి.
అగ్రవర్ణములవారు అధికారపరవశు లయి తాము ముందు
భ్రష్టత్వము జెందిరి; పిదప తమతోపాటు సర్వజనులు

పతనము జెందుటకు కారకు లయిరి. దేశము మాంద్య మున మునిగెను. మూఢవిశ్వాసములు చెలరేగెను. కుల వైరములు ప్రబలెను. దురాచారములు పెంపొందెను. మతముపేరిట నరబలులు, శిశుహత్యలు, స్త్రీహత్యలు, అన్యాయములు, అవినీతులు వ్యాప్తము లయ్యెను. ఇట్లు పతితమయిన హిందూజాతి పరులకు సులభముగ వశ మగుటలో నాశ్చర్య మేమి? మహమ్మదీయులకు లోబడి నది. పశ్చిమదేశములనుండి వచ్చిన ప్రతిజాతివారికిని దోసిలి యొగ్గినది. రాజకీయముగ సంపూర్ణ పరాధీనత సంప్రాప్త మయినది. భారతజాతి యెప్పుడును కొన్ని సంఘములయొక్క కూడిక యె గాని సమానవిశ్వాసములను ఏకాచారములను గలిగిన యొక సంఘముగా నుండలేదు. ధర్మజీవన ముచ్చస్థితియం దుండి కాపాడుచుండి నప్పుడు, ఆ వివిధసంఘములు ప్రేమబద్ధము లయి యన్యోన్యాభి వృద్ధికి సహకారులుగ నుండెను. కాని యది క్షీణించిన తోడనె ప్రాణశక్తి తగ్గినకొలది దేహములోని వివిధాం గములు కృశించు నట్లు హిందూజాతియందలి పలుతెగ లవారు మైత్రిని గోల్పోయి బలహీను లగుచుండిరి. కావున హిందూజాతియొక్క పతనమునకు నైకమత్యా

భావమే ముఖ్యకారణము. ధర్మజీవనము గోల్పోయి యమితదుర్బలస్థితిలో నది నవయుగ ప్రారంభమున నుండెను.

### అనుకరణ జీవనము

దేశ మివ్విధమున బలహీనముగ నుండుటవలన, పాశ్చాత్యుల నాగరికతయు ఆచారవ్యవహారములును జనులయందు వ్యాపింపజొచ్చెను. ప్రభువులై వర్తకమును వివిధమార్గముల పెంపొందించుకొన గలిగిన పాశ్చాత్యవర్తకుల పోటికి నిల్వజాలక జీవనాధారములుగ నున్న చేతిపను లన్నియు నశించుచు వచ్చినకొలది, దేశమునందు దారిద్ర్యము ప్రబలి పాశ్చాత్యుల సాహాయ్యమవసర మయ్యెను. వాడుకొను ప్రతివస్తువుకొరకు దేశస్థులు వారిపై నాధారపడవలసి వచ్చెను. ప్రభుత్వమునం దుద్యోగములు చేయుచు జ్ఞానవంతులు పొట్టపోసికొన వలసివచ్చెను. సాహాయ్యులుగను, అధికారులుగను తమకంటె నధికు లయి పాశ్చాత్యులు దేశమున నున్నప్పుడు, దేశీయులు వారి నాశ్రయించుచు వారి వద్ద

తుల ననుకరించిరి. ఆంగ్లప్రభువులయొక్కయు, ఇతరపాశ్చాత్యుల యొక్కయు నాగరికతయె హిందూదేశము నావరించిన నవయుగవాతావరణము. హిందూదేశస్థులు పాశ్చాత్యదేశములకు పోవుచు తద్వారమున కూడ పాశ్చాత్యనాగరికతావ్యామోహమున తగులుకొనుచు వచ్చిరి. బలహీనులకు మంచిచెడుగులను విచారించు శక్తి తగ్గును; కాన భారతీయులు విచక్షణరహితముగ పాశ్చాత్యనాగరికతయందలి సర్వమును గ్రహించిరి. అందు కొన్ని కేవలము బాహ్యవిషయములు; మరి కొన్ని యాంతరికప్రవృత్తులు. మొదట సామాన్యముగ బాహ్యవిషయములె దృష్టియందు నిలచును. వారి దుస్తులు, ఆహారపానీయములు, ఆటపాటలు, సాంఘికాచారములు అంధప్రాయముగ స్వీకరింపబడెను. వానిలో భారతీయులకు ననవసరములును హానికరములు నైనవి యనేకము గలవు. అట్టివానిమూలమున వారు విశేషధన వ్యయమునకును, ఇతరనష్టములకును లోనగుచున్నా రని యెల్లరెరింగిన విషయమె. ఆచారదాస్యముకంటె భావదాస్యము ఎక్కువ నష్టకరము గదా? నవయుగమున ఆంగ్లవిద్య నభ్యసించిన భారతీయులు సాధారణముగ

ఆ ద్వివిధదాస్యములకు వశు లగుచు 'ఆంగ్లమానసపుత్రులు' అను నామమున కర్హు లగుచున్నారు. ఆంగ్లేయులందు నేర్చుకొనదగిన దేదియు లేదని చెప్పుట లేదు. వారియందలి మంచిని గుర్తించి దానిని మాత్రమె స్వీకరించు శక్తి భారతీయులకు లోపించినది. అందువలన వారికి తమ దోషములకు తోడుగ పాశ్చాత్త్యులదోషములును సమకూడి జీవితము మరింత దుర్భర మయ్యెను.

పాశ్చాత్త్యులలోని హానికరము లగు పద్ధతు లేవో రానురాను తెలిసికొనబడు చున్నవి. వాని బారినుండి తప్పించుకొన వలయు నని కూడ తలంపు కలుగుచున్నది. వానినిగురించి పెంచి వ్రాయుట యనావశ్యకము. కాని వారిలో కొన్ని పద్ధతులు శ్రేష్ఠము లయినవిగ ప్రసిద్ధి జెందియున్నవి. అవి కొంతవరకు శ్రేష్ఠములె గాని సంపూర్ణముగ శ్రేష్ఠములు గావు. వానిని మించిన యుత్తమపద్ధతులు లే వని వానియందె నిమగ్న మగుటవలన జీవితమును చాల పరిమితమె గాక స్వార్థనిబద్ధము కూడ చేయుట యగును. స్వార్థము నతిక్రమించుచు మానవుడు క్రమముగ నున్నతధర్మజీవనమునందు పెరుగ వలయును.

యావన్మానవకోటితోడను సమ స్తవిశ్వముతోడను నైక్య
త జెంద వలయును. ధర్మవికాసమునకు వలసిన సాధనసం
ప త్తి భారతీయుల కెంతయో గలదు గదా! దానిని విడ
నాడి పాశ్చాత్యులపద్ధతులనే యనుసరించుట మూల
మున భారతీయులు తాము వృద్ధి జెందుచున్నా మని
తలంచుచు తెలియకయె నష్టపడుచున్నారు. కావున
పాశ్చాత్యనాగరికతయందు శ్రేష్ఠములుగ పరిగణింపబడు
విషయముల నె త్తికొని విమర్శించుట ముఖ్యము.

### భౌతిక విజ్ఞానము

వానిలో ముఖ్యమైనది భౌతిక విజ్ఞానము. ఆంగ్లేయు
లేమి, ఇతరపాశ్చాత్యు లేమి దానియం దధికోన్నతిని
గాంచిరి. ప్రపంచమందలి పదార్థములు పరిశీలింపబడి
వాని గుణవిశేషములు తెలిసికొనబడెను. భూమిపై
నున్న వస్తువులే గాక ఆకాశములోని గోళములు గూడ
పరీక్షింపబడెను. అనేక భౌతికవిజ్ఞానశాస్త్రములు బయ
లువెడలెను. పదార్థశాస్త్రము, రసాయనశాస్త్రము,
జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, ఖగోళశాస్త్రము

మొదలగునవి ఆంగ్లవిద్యార్థికు లగు భారతీయుల దృష్టి నాకర్షించినవి. పాశ్చాత్యుల ప్రజ్ఞావిశేషము వాని యందు గాంచి యచ్చెరు వొంది భారతీయులు తాము కూడ వారివలె భౌతికవిజ్ఞానమునందు నధికు లగుటకు యత్నింప సాగిరి. జె. సి. బోసు, పి. సి. రాయి, సి. వి. రామర్ మున్నగువారు భౌతికవిజ్ఞానమునందు గొప్ప కృషి సలిపి జగత్ప్రసిద్ధు లయిరి. సర్వసామాన్యముగ విద్యార్థికు లందరు భౌతికవిజ్ఞానమునం దభిరుచి గలిగి త త్ఫాలమున మానవుని సంపూర్ణాభివృద్ధి సిద్ధించునని నమ్ము చున్నారు. వస్తులక్షణములను తెలిసికొని వస్తువులను భిన్నప్రకారముల సంయోగపరచుచు భౌతికవైజ్ఞాని కులు క్రొత్త పదార్థములను నిర్మింప గలుగుచున్నారు. ఈ నిర్మాణకౌశలము వృద్ధి జెందినకొలది సామాన్యప్రాణు లనే గాక యుత్తమజీవులుగ పరిగణింపబడు మానవు లను గూడ స్వభావసిద్ధము లగు పద్ధతుల ననుసరింపక యె స్వకల్పితమార్గములచే సృజింప వారు శక్తివంతు లగుదు రను విశ్వాసము వ్యాపించు చున్నది. భౌతికవిజ్ఞానము నకు సాధ్యముగాని కార్యము ఏదియు నుండనేర దని తలంచి యీ నవయుగమున జనులు భౌతికవిజ్ఞానసంపా

దనమునకు తమ శక్తులన్నియు వినియోగించుచున్నారు. భౌతికవిజ్ఞానలాభము ననుభవించు వారెల్లరు దానియెడల గౌరవమునె చూపుదు రనుటకు సంశయము లేదు. కాని భౌతికవిజ్ఞానము సృష్టిరహస్యము లన్నియు తెలుపు ననియు, దానిద్వారమున మానవుని యక్కర లన్నియు తీరు ననియు, పరమేశ్వరునిగురించిన విచారణములు కేవల మనావశ్యకము లనియు, పరమేశ్వరుని మరచి భౌతికవిజ్ఞానమును నమ్ముకొనిన చాలు ననియు నవయుగమున పలువురయభిప్రాయ మైనది. ఈ సందర్భమున ఒక సంగతి గమనింపవలయును. భౌతికవస్తుపరిశీలనమునకు తోడ్పడునది మానవుని మనస్సు. మనశ్శక్తి పదార్థములను విడదీయ గలదు; తర్కించ గలదు; లక్షణముల నిరూపింప గలదు. ఇంద్రియగోచరము లగు విషయముల నాధారపరచుకొనియె మనస్సు తన విచారణములను నలుపగలదు. మనస్సునకు వస్తువుల నెంత తరచిన నంతగా సూక్ష్మాతిసూక్ష్మము లగు నణువులు గోచరమైన కొలది, వాని నతీతించి వానికి కారణముగా నేదో యద్భుతశక్తి గల దని భౌతికవైజ్ఞానికులు విస్మయము నొందుచున్నారు. "ఇరువదియవ శతాబ్దమునందు భౌతిక

వస్తువిజ్ఞానవేత్తలు గ్రహించిన మహద్విషయము, తా మింకను సృష్టిలోని మూలసత్యమును స్పృశింపనైన లేదనుటయే. ప్లేటో పూర్వము చెప్పిన సుప్రసిద్ధోపమానమువలె, వారు వారిగుహలయందు వెలుతురువైపు వీపులు త్రిప్పబడి, గోడమీది నీడలను మాత్రము చూడగలుగునట్లు బంధింపబడి యున్నారు." [1] అని మహాభౌతికవైజ్ఞానిక పండితునుగ నేడు ప్రసిద్ధిజెందిన పాశ్చాత్యుడే, సర్. జేమ్సుజీన్సు, నుడువు చున్నాడు. దీనివలన సృష్టిమర్మము దురవగాహముగ నున్నదనియు, భౌతికవైజ్ఞానికుల పరిశీలనలకు సహాయభూతముగ నున్న మనశ్శక్తి బహ్వాల్పమైనదనియు తేటపడుచున్నది. "సర్వవ్యాప్తమై అనిర్వచనీయమై అద్భుతముగ నున్న మహాశక్తి యొకటి యున్నది. నాకు దాని యనుభవము కలదు;

1. It (the outstanding achievement of the 20th century physics) is the general recognition that we are not yet in contact with ultimate reality. To speak in terms of Plato's well-known simile, we are still imprisoned in our cave, with our backs to the light and can only watch the shadows on the wall. *Sir James Jeans: The Mysterious Universe* p. 111.

కాని నేను దానిని చూడజాలను ఈ దుర్గోచరమైన శక్తియే స్వయముగ అనుభూత మగుచున్నను హేతువును ధిక్కరించు చున్నది. ఏలయన, ఇంద్రియముల ద్వారమున నేను గ్రహించు సర్వముకంటె అది యెంతయో భిన్నము. అది యింద్రియముల నతిక్రమించును" [1] అని గాంధిమహాత్ముడు చెప్పినట్లు, మానవులు హేతుజ్ఞానమునే నమ్ముకొనక దానిని మించిన ఆత్మశక్తిద్వారమున విశ్వమునకంతకు ఆధారభూతుడై యున్న పరమేశ్వరుని సాన్నిధ్యానుభవమును పొందవలసి యుందురు. ఇట్టి ఉత్తమధర్మజీవనము సంప్రదాయసిద్ధముగ దేశములో గాంధిమహాత్మునివంటి యే కొలదిమహనీయులలోనో ఇంకను నిలచియున్నను, హిందూధర్మగ్రంథము లన్నియు దాని ప్రాముఖ్యతను వేనోళ్ల చాటుచున్నను,

1. There is an indefinable mysterious Power that pervades every thing. I feel it, though I do not see it. It is this unseen Power, that makes itself felt and yet defies proof; because it is so unlike all that I perceive through my senses. It transcends the senses.

*Mahatma Gandhi: Young India 11—10—1928.*

దానిని గమనింప నశక్తు లగుచు భారతీయులు భౌతిక విజ్ఞానమునె పరమప్రమాణముగ గైకొనుచున్నారు.

## యంత్రాలయ నిర్మాణము

భౌతికవిజ్ఞానము పాశ్చాత్యులందు యంత్రనిర్మాణ కౌశలము విశేషముగ పెంపొందించెను. శరీరబలముతో నిర్వహింపబడుచుండిన కార్యము లన్నియు క్రమక్రమముగా యంత్రసాహాయ్యమున గావించుటకు అత్యంత కృషి ఈ నవయుగమున జరుచుచున్నది. ఎద్దుబండ్లు, అశ్వ శకటములు మూలబడినవి. వానికి బదులు, మోటార్లు, రైళ్లు వాడుకలోనికి వచ్చినవి. పడవల యుపయోగము తగ్గినది. పొగయోడలు వ్యాపనములోనికి వచ్చినవి. వీని నన్నిటిని మించి వాయువిమానములు కూడ సామాన్యము లైనవి. యంత్రసాహాయ్యముతో పొల ములు దున్నబడుచున్నవి; ధాన్యము దంపబడుచున్నది; బట్టలు నేయబడు చున్నవి; దీపములు వెలిగింపబడు చున్నవి. ఇటులనే సర్వ పరిశ్రమలయందు మానవుని స్థానమును యంత్రము లాక్రమించినవి. తద్వారమున

బహుసంఖ్యాకులకు జీవనోపాధులుగ నుండిన వృత్తులు నశించినవి. మరియు యంత్రాలయముల స్థాపనమునకు అధికధన మావశ్యక మగుటచే ఐశ్వర్యవంతులు కొలది మంది వలసిన ధనమును సమకూర్చుచు, యంత్రాలయ నిర్వహణభారమును వహించుచున్నారు. యంత్రాలయ ములమూలమున వారు సాధ్యమైనంత లాభములను గణించి, మరింత ధనాఢ్యు లగుచున్నారు. దరిద్రులు యంత్రాలయములయందు పనిచేయుచు ధనికుల యొత్తి డికి లోనగుచు, తీరని దారిద్ర్యమున మునుగుచున్నారు. ఇట్లు పాటుపడి ఏ స్వల్పవేతనములో ఆర్జించువారు కూడ కొలదిమందియే. పలువురు నిరుద్యోగు లగుచు దారిద్ర్యమున దొగాడు చున్నారు. యంత్రములవద్ద పనిచేయువారు స్వబుద్ధి నుపయోగింప వలసిన యవస రము లేక కేవలము యంత్రపాయు లగుదురు. అట్టి వారు యంత్రాలయాధికారు లగు ధనికుల నిరంకుశ పాలనమునకు లోనయి ఒక విధముగ మానవనామము నకె అనర్హు లగుదు రనుటలో నతిశయోక్తి లేదు. పాశ్చాత్యదేశములలో యంత్రాలయముల వలనిదుష్ఫల ములు అధికమై వానిని దొలగించుకొను నుపాయ

మెద్దియు గానక జనులు తల్లడిల్లు చున్నారు. అట్టితరి చేతిపను లన్నియు కోల్పోయి పాశ్చాత్యులవలె యంత్రాలయ నిర్మాణమునకు హిందూదేశస్థులు కూడ గడంగి రనిన, ఎట్టి క్లిష్టపరిస్థితులు వారియందు సమకూరునో వేరుగ వివరింప నవసరము లేదు. ధనికులు దరిద్రులను, గొప్పజాతులు హీనజాతులను, బాధపెట్టుటకు యంత్రాలయములు ప్రస్తుతము తోడ్పడు చున్న వని నిశ్చయముగ చెప్పవలసియుండినను, యంత్రములవలని సౌకర్యములను పూర్తిగ విడువవలయు నని నుడువుటకు వలను పడదు. కాని వానిని సర్వమానవ సౌఖ్యమునకును అభివృద్ధికిని భంగము కలుగకుండ నుపయోగించుకొన వలయును. యంత్రములకు ఉపయోగము కలదు. అవి వాడుకలో నుండియే తీరును. కాని ఆవశ్యకమైన శరీర పరిశ్రమను తొలగించుటకు వాని కవకాశ మియ్య కూడదు. గృహములలో నుపయోగించు యంత్రములను ఎంత వృద్ధిలోనికి తెచ్చిన మన కంత మంచిది. కోట్లకొలదిగ నున్న కర్షకులకు వారి గృహములందు ఏ యితర వృత్తులు కల్పింపక, ఆవిరియంత్రముల పెట్టి వారి చేతి పనుల నిర్మూలించుట గొప్ప యనర్థ మనిచెప్పకతప్పదు.

"అపారముగ నెలకొల్పబడు చున్న నిర్జీవయంత్రములయా
రాధనతో వివిధ దేశములవారు విసుగు జెందు చున్నారు.
నిరుపమానము లగు సజీవయంత్రము లనదగు మన
శరీరములకు బదులు నిర్జీవయంత్రములను వాడుచు
మనము వానిని కృశింప జేయుచు వినాశము నొందించు
చున్నాము. దేహమును పూర్ణపరిశ్రమద్వారమున విని
యోగమునకు దీసికొని రావలయు ననియె యీశ్వర
శాసనము. మనము దానిని త్రోసిపుచ్చ జాలము."[1]
అని గాంధిమహాత్ముడు నుడివిన మాటలలో గల యాథా
ర్థ్యము నేడు క్రమముగ జనామోదము బడయుచున్నది.
గృహపరిశ్రమలు అంతరించుటచే జనులకు తినుటకు తిండి
కూడ దొరకుట దుర్లభ మగుచున్నది. ఈ యంత్రాల
యవ్యామోహమున తగుల్కొని ధనికులు కొందరు

1. Notions are tired of the worship of lifeless machines multiplied *ad infinitum.* Wo are destroying the matchless living machines viz. our own bodies leaving them to rust and trying to substitute lifeless machinery for them. It is a law of God that the body must be fully worked and utilised. We dare not ignore it.

*Mahatma Gandhi: Young India 8—1—1925.*

కొన్ని యంత్రశాలలు నిర్మించుచు నెచటనైన మిగిలి యున్న చేతిపనులను కూడ నశింపజేయు చున్నారు. హిందూదేశములో కూడ ధనికులకును, దరిద్రులకును పోరాట మేర్పడి యతిశయిల్లుచున్నది.

## ధనారాధనము

పాశ్చాత్యనాగరికతయొక్క లక్ష్యము ప్రాపంచికైశ్వర్యమును వృద్ధిచేయుట యని చెప్పవచ్చును. ప్రతివ్యక్తి తన ధనమును పెంపొందించుకొనుచు నితరులకంటె నధికుడగుటకు పాటుపడును. ప్రతిజాతియు నదేవిధముగ నెక్కుడు ధనవంత మగుచు నితరజాతులకంటె మిన్న యగుటకు యత్నించును. ఇవ్విధమున వ్యక్తుల నడుమను, జాతుల మధ్యను, ఎడతెగని పోరాటము కల్గుచున్నది. భౌతికసంపద ప్రపంచమున నున్నదంతయు కలిపి చూచినను, కొంత పరిమితి గలదియే యని, యొప్పుకొనక తప్పదు. దేశములు కొన్నిమాత్రమె కలవు. విలువగల వస్తువులును, కొన్నియే యుండును. వానికొరకు నెల్లరు పోరాడుచుండినయెడల వారిలో కొంద రెక్కువగను,

కొందరు తక్కువగనువానిని బడయుచు నీర్ష్యాళువులై పరస్పరవైరములు గలిగి అశాంతికి పాల్పడుదురు. జీవితోద్దేశము ప్రాపంచికవస్తుసంపాదనముగ మాత్రమె చేసికొనుటలో చాల యరిష్ట మున్నది. ప్రాపంచికవిషయములు బుద్ధిప్రమత్తత కలిగించి మానవులను సంపూర్ణముగ వినాశము నొందింప గలవు. విషయములను తిరిగి తిరిగి తలపోయుటవలన వానిని పొందవలె నను కోరిక జనించుననియు, ఆ కోరికవలన క్రోధమును, క్రోధమువలన మోహమును, మోహమువలన స్మృతివిభ్రమమును గలుగు ననియు, స్మృతివిభ్రమముచే బుద్ధి నశించి తద్వారమున సంపూర్ణ వినాశముచేకూరుననియు, చెప్పిన భగవద్గీతావచనము[1] ఈ సందర్భమున నెంతయు స్మరింప దగినది. ప్రపంచాధికృతకొరకు విశేషకృషి సల్పుచు తుదకు పాశ్చాత్యదే

1. ధ్యాయతో విషయాన్ పుంస స్సంగ స్తేషూపజాయతే,
సంగా త్సంజాయతే కామః కామా త్క్రోధో భిజాయతే,
క్రోధా ద్భవతి సమ్మోహ స్సమ్మోహా త్స్మృతివిభ్రమః,
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి.

భగవద్గీత. II- 62, 63.

శములలోని వివిధజాతులవారు కొలది సంవత్సరములకిం దటనే మహాసంగ్రామమున తగుల్కొని యమితప్రాణ నష్టమును, ధనవ్యయమును పొంది రని యెల్ల రెరిం గిన విషయమె. భౌతికవిజ్ఞానము మానవసౌఖ్యమునకు తోడ్పడు యంత్రములను నిర్మించుకొనుటకు మాత్రమె గాక, మహామారణయంత్రములను తయారుచేయుటకు కూడ నుపయోగపడుచున్నది. ఉద్దేశ్యము సవ్యముగ లేనప్పుడు మేలు చేయునది కూడ కీడునకు వినియుక్త మగును కదా? ఐహికైశ్వర్యములకొరకు పోటిపడుచు జీవనము గడుపు టత్యంత హానికరము. ఆముష్మికైశ్వర్య మగు ధర్మము నెవ రెంత సంపాదించినను, ఇతరులకు హాని కలుగక పోవుటయె గాక, మేలే చేకూరును. ధర్మము ఇతరులలో వ్యాపనము చేయుటవలన ధర్మము నకు నష్టము లేదు. హిందూదేశస్థులుసయితము ప్రాపం చికైశ్వర్యములకొరకు పెనగులాడు జీవితమున ప్రవేశిం చుచున్నారు. "మన శరీరసంబంధమయిన తృప్తిసాధ లన్నిటికిని కొంత మేర కలదు. ఆ హద్దును దాటుట యన ఆరోగ్యమును కోల్పోవుటయే యని మన మెరుం గుదుము. అధికారైశ్వర్యములకొరకు మానవులు కలిగి

యుండు తృష్ణకు మృత్యువాత బడద్రోయునవి యై మీఱ
రాని హద్దు లెవ్వియు లేవా? ధనప్రమత్తులై పాశ్చాత్య
జాతులు ఈ గొప్ప జూదములయందు తగుల్కొని భౌతిక
వస్తువులను మాత్రమే సమకూర్చుకొనుచు ధార్మికాదర్శ
ముల నలవరచుకొనుటలో నుదాసీనులయి తమ జీవశక్తిని
చాలవరకు వ్యర్థపుచ్చుట లేదా? ఏనాగరికతయైన నాము
ష్మిక సుఖజీవనమునకు సంబంధించిన జ్ఞానము విస్మరించి,
భౌతికపదార్థములను సేకరించుచు నంతులేనియభివృద్ధిగాం
చగలదా?[1] అని విశ్వకవి రవీంద్రుడు విచారించుచున్నాడు.
వాస్తవమునకు నేడు ప్రపంచమునందు విశేషముగ
దైవారాధనకంటె ధనారాధనమే యెక్కుడు వ్యాప్త
ములో నుండి తత్ఫలములనెల్ల ననుభవించుచున్నారు.
హిందూదేశము కూడ అట్టి వాతావరణపరివృతమైనది.

1. In all our physical appetites we recognize a limit. We know that to exceed that limit is to exceed the limit of health. But has this lust for wealth and power no bounds beyond which is death's dominion. In these National Carnivals of materialism are not the western peoples spending most of their vital energy in merely producing things and neglecting the creation of ideals?

*Rabindranath: Nationalism, p. 119.*

## జాతీయభావము

పాశ్చాత్త్యులజీవనము ప్రధానముగ జాతీయభావ ప్రేరితము. ఏకదేశమునందు వసించుచు స్వపరిపాలనము కలిగిన జనులు ఒక్క జాతివార మను తలంపు గలిగి తదభివృద్ధికొరకు తమ సర్వశక్తులు ధారపోయుదురు. వ్యక్తి స్వలాభమునె చూచుకొనుచు ఇతరుల కొరకు పాటుపడ నప్పుడు, స్వార్థపరు డని పరిగణింపబడునుగదా! కుటుంబము తనయందలి వ్యక్తుల స్వార్థమును నిర్మూలించు నదియే యైనను స్వాభివృద్ధియందె నిమగ్నమై యితరకుటుంబముల శ్రేయమున కెంతమాత్రము తోడ్పనియెడల స్వార్థపరత్వమున దగుల్కొనిన దని చెప్పవలయును. అటులనె జాతి దేశాభిమానము రగుల్కొలుపుచు వ్యక్తులను స్వార్థత్యాగులనుగ జేయుచున్నను అన్యజాతుల మేలును తలంపక స్వోన్నతికి సర్వవిధముల ప్రయత్నించు నపుడు జాతి కూడ స్వార్థపరాయణత్వమే వహించును. వ్యక్తి గాని, కుటుంబము గాని, జాతి గాని, స్వార్థబద్ధమైనతోడనె జీవనవికాసము దుర్లభ మగును. వ్యక్తులును, కుటుంబములును, జాతు

లును, ప్రత్యేకముగ జీవింపవలసి యున్నను, అవి విశ్వ వ్యాప్తమైన జీవనముతో నెంతవరకు సంబంధము కలిగి యుండగలవో అంతవరకు అభివృద్ధిని గాంచ గలవు. జీవము జీవియందె యిమిడి యున్నను, జీవనాధారమగు పదార్థములు బాహ్యమున నుండును. జీవి వానిని గ్రహించి వర్ధిల్ల వలయును. ఎందరెందరో పాటుపడుచు, ఎన్నెన్నో వస్తువులు లభించుచు, బాహ్యమునుండి ఎంతయో సాహాయ్యము చేకూరినప్పుడు గదా, వ్యక్తి వృద్ధి పొందునది? కుటుంబాభివృద్ధియే గాక జాత్యభ్యున్నతియు, అట్టి బాహ్యసాహాయ్యముమీదనె ఆధారపడి యుండును. పరులతో మిత్రభావమున మెలంగక పోవుటయే గాక విరోధము కల్పించుకొనుటమూలమున, ఏ జాతి యైనను వినాశము జెందక తప్పదు. పాశ్చాత్య దేశములందు ఈయుగమున విజృంభించి యున్న జాతీయత ముఖ్యముగ స్వార్థమునే లక్ష్యముగా గలిగి అచటిజాతులను పరస్పరవైరములందు ప్రవేశపెట్టుచున్నది. మరియు ఆ జాతీయత వ్యక్తుల స్వాతంత్ర్యములకు కూడ చోటిచ్చుట లేదు. వ్యక్తుల అభిరుచులు, ప్రత్యేకలక్షణములు, సహజవికాసములు, జాతీయతపేరిట నణగ

ద్రొక్కబడుచున్నవి. జాతి తాను నిర్ణయించుకొనిన లక్ష్యమునకు వ్యక్తులందరు తోడ్పడునట్లు నిర్బంధించును. ఒక యంత్రములోని చక్రములవలె వ్యక్తులు జాతి యందు ఎట్టి స్వాతంత్ర్యమును లేక మెలగవలసి యుండును. ఆ విధముగా వ్యక్తులు జాతికొరకు బలియగుచున్నారు. యథార్థముగ వ్యక్తులకు స్వాతంత్ర్య మిచ్చు సంఘమె, దళములన్నియు విప్పుకొని వికసించు పుష్పము వలె, సంపూర్ణాభివృద్ధి గాంచును. సంఘజీవనము వర్ధిల్ల జేయువారు వ్యక్తులె. పాశ్చాత్యజాతీయ జీవనమును పెంపొందించుటకు వ్యక్తులు సాయపడ లేకున్నారు. వ్యక్తులు అణగి పోయినకొలది జాతియందలి జీవమె తగ్గునని చెప్పవలెను. కావున పాశ్చాత్యజాతులు అంతర్జీవనమును కృశింప జేసికొనుచు జీవనాధార మగు బాహ్య ప్రపంచ సంపర్కమును త్రెంపుకొనుచు, ఆత్మవినాశము గావించుకొను చున్నవి. "వైరమునకు, ఆక్రమణమునకు, పూనుకొనెడు బుద్ధియే పాశ్చాత్యజాతీయతకు కారణమయి, దానిని నడుపుచున్న దనుట సత్యము. అన్యోన్య సహకారము దాని కాధారముగ లేదు. అది పశుబలమును చక్కగ సమకూర్పగలదే గాని అధ్యాత్మికాదర్శ

మును నిరూపింప లేదు. తినుటకు జంతువులను వెదకుట యె వృత్తిగాగల క్రూరమృగములవలె, అదియు చరించు చున్నది."[1] అని రవీంద్రనాథుడు ఘంటాపదముగ పల్కుచున్నాడు. భారతీయులు పాశ్చాత్యుల సాంగత్య మువలన తాము నాగరికులను గాన రాకుండ జాతీయ శృంఖలము లందు తగుల్కొను చున్నారు.

## సమత్వ సిద్ధాంతము

పాశ్చాత్యులందు విశేషముగ ప్రశంసింపబడునది మరియొకటి గలదు. అది మానవసమత్వ సిద్ధాంతము. సర్వమానవులు సమానాధికారములు గలిగి సుఖజీవనము బడయవలయు నని ఆ సిద్ధాంతము ప్రకటించును.

1. The truth is that the spirit of conflict and conquest is at the origin and in the centre of western nationalism; its basis is not social co-operation. It has evolved a perfect organization of power, but not spiritual idealism. It is like the pack of predatory creatures that must have its victims.

*Rabindranath: Nationalism, p. 21.*

పాశ్చాత్యదేశములందు మానవసమత్వ మనుసరించి యె ప్రభుత్వములు స్థాపింపబడె నని ప్రతీతి. అచ్చటి సాంఘికజీవనమునందును సమత్వము పాటింపబడు నని కూడ చెప్పుదురు. కాని ఈ సమత్వసిద్ధాంతమును పాశ్చాత్యులెంతవర కాచరణమందు తెచ్చుకొన గలిగిరో పైని తెలిపిన అంశములనుబట్టి చాలవరకు తెలిసియే యుండును. పాశ్చాత్యులలో ధనికులు ప్రబలులై ధనహీనులను పీడించుచుందు రనియు, జాతీయతమూలమున వ్యక్తులకు స్వాతంత్ర్యమే లేకపోవుచున్న దనియు, విస్పష్టమయ్యెను. పాశ్చాత్యప్రభుత్వములు సామాన్యముగ ధనికుల ప్రభుత్వము లని చెప్పవలెను. ధనికులు ప్రజాపాలనము పేరిటసర్వాధికారములు నిర్వహించుచున్నారు. ప్రతిసంఘమునందు కొందరు శక్తివంతులుగను, కొందరు శక్తివిహీనులుగను, సర్వదా ఉండక తప్పదు. శక్తివంతులు శక్తిహీనులను సమత్వబుద్ధితో చూచుట సాధారణవిషయము కాదు. జననీజనకులు సర్వవిధముల తమ శిశువులకంటె నధికులె. కాని వారు బిడ్డలను ప్రాణతుల్యులుగ జూచుకొనుటకు కారణము వారి హృదయములందు జనించు నవ్యాజప్రేమ. అట్టి పవిత్రప్రేమ బల

వంతులయందు, నెలకొనినగాని సమత్వజీవనము సంఘ మందు పరివ్యాప్తము కానేరదు. ప్రాపంచిక భోగముల యందు, శరీరశక్తిసామర్థ్యములందు, ఎన్ని తారతమ్యములు మానవులలో నున్నప్పటికిని, వారు తమయం దెల్లరి లోను ఏకముగ వ్యాప్తమై ఎల్లరిని ఒక్కటి చేయు చున్న ఆధ్యాత్మిక జీవనము గాంచి ప్రేమబద్ధు లయి యుండినయెడల వారియందు యథార్థ సమత్వ జీవనము స్థాపిత మగును. సర్వాంతర్యామి యై ప్రేమ స్వరూపుడుగ నున్న పరమేశ్వరునియందు దృఢభక్తి కల వారలె "తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరగువాడు" అయిన ప్రహ్లాదుని వలె మెలగ గల్గుదురు. ఆధ్యాత్మికజీవనమునకు దూరు లైనతరువాత ఎట్టి యుత్తమసిద్ధాంతముల నైనను నామ మాత్రముగనె యనుసరించుట సాధ్యము గాని, వానిని యథార్థరూపమున సాంఘికజీవనమునందు మూర్తీభ వింప చేయుట దుర్లభము. ఇందువలననే "ఈ వైరుధ్యము గాంచవలసివచ్చు చున్నది. పాశ్చాత్యజీవనము స్వాతం త్ర్యపతాకముతోనే ముందునకు పోవుచున్నది కాని, పాశ్చాత్యజాతీయభావము ఇనుపసంకెళ్లవంటి పరిపాలనా

పద్ధతులను తయారుచేయుచున్నది. యావన్మానవ చరిత్రలోను అంతటి దయాశూన్యములును, కఠినములు నైనట్టి విధానము లెన్నడును నిర్మింపబడ లేదు."[1] అని రవీంద్రుడు నుడువవలసి వచ్చెను. పాశ్చాత్యపరిపాలనాపద్ధతులనే యనుకరించుచు హిందూదేశములోని విద్యాధికులు కూడ నభివృద్ధిగాంచుచున్నా మని భ్రమించుచున్నారు.

## ఆత్మశక్తి ప్రభావము

పాశ్చాత్యనాగరకతకు, భౌతికవిజ్ఞానము, వేదము; ధనము, దైవము; జాతీయత, పూజారి; యంత్రాలయములు, ప్రభుత్వములు, ఆరాధనమందిరములు; పోటి

1. And we cannot but acknowledge this paradox, that while the spirit of the west marches under its banner of freedom, the Nation of the West forges its iron chains of organization which are the most relentless and unbreakable that have ever been manufactured in the whole history of man.

*Rabindranath: Nationalism*, p. 24.

పడుట జీవితధర్మసూత్రము; పరపీడనము జీవితపరమా
వధి. ఇట్లు పాశ్చాత్యనాగరికత విషయనిబద్ధ మై, స్వార్థ
ప్రేరిత మై, విశ్వమానవకోటికి వినాశహేతువుగ నున్న
దని పాశ్చాత్యులలో ప్రతిభావంతు లగు ధీశాలులు
కూడ నభిప్రాయ పడుచున్నారు. ఆంగ్లతత్త్వవేత్త
బెర్ట్రాండు రస్సెలు స్వదేశాభిమాన మన ప్రభుత్వము
లిచ్ఛగించినప్పు డెల్ల ఏ మాత్రము యోచన లేకయే
జనులు పరస్పర సమూహాల వినాశమందు ప్రమత్తు లగు
టకు వాంఛించుటయే యని నిర్వచించి "దేశాభిమాన
మను పేర పిలువబడునది నిస్సంశయముగ మహాభయం
కర మగు నుపద్రవము. ప్రస్తుతనాగరికత దాని బారిని
పడినది. దాని క్రౌర్యమును పెంపొందించునట్టి దేనిని
గాంచినను మహామారి, విషూచి, క్షామము వీనికంటె
నెక్కుడుగ భీతి నందవలెను." అని వాక్రుచ్చెను.

1. Patriotism (*i.e.*) a willingness to indulge in mutual extermination without a moment's hesitation, whenever the governments feel so inclined. Undoubtedly patriotism, so-called, is the gravest danger to which civilization is at present exposed, and any-

“గస్టావ్ లేబాఁ నుడివినట్లు, సామాన్యమానవుడు సంఘజీవియయి మందలోని గొఱ్ఱెవలె నుద్రేకస్వభావుడును, ఆతురశీలుడును, వివేచనా శూన్యుడు నగుటచే, నవీనపరిస్థితులందు అన్ని గొప్ప జాతులలోను రాజకీయ ప్రజాపరిపాలనమువలన, ధనికులయిన వార్తాపత్రికాప్రవర్తకుల యొక్కయు తమ్ము ప్రసిద్ధిపరచుకొను కర్మాగార నిర్వాహకులయొక్కయు కార్యోత్సాహము గల యైశ్వర్యవంతులయొక్కయు—అనగా జనసమూహమును తమ యిచ్ఛానుసారము నడపుకొనుటకు తోడ్పడు నభిప్రాయములను వెదజల్లగల ప్రముఖులయొక్క చేతులలో నధికారము పెట్టుటయె సామాన్యముగ కలుగుచున్న ఫలితము.”[1] అనిఆంగ్ల మహనీయుడు హెచ్.జి. వెల్సు వెల్ల

thing that increases its verulence is more to be dreaded than plague, pestilence and famine.

*Bertrand Russell: Marriage and Morals, p. 172*

1. Since the common man is, as Gustave Le Bon has pointed out, a gregarious animal, collectively rather like a sheep, emotional, hasty and shallow, the practical outcome of political democracy in all large communities under modern conditions is to put

డించుచున్నాడు. పాశ్చాత్యనాగరికతాఫలితములు దుర్భరము లై వినాశహేతువులుగ పరిణమిల్లి యుండుటచే పాశ్చాత్యులలోనే వానిని నివారించుటకు కొన్ని యుద్యమములు బయలుదేరుచున్నవి. యథార్థసమత్వ జీవనము నెలకొల్పు విధానములకొరకు అన్వేషణము ప్రారంభమైనది. ప్రపంచశాంతికి, విశ్వమానవకల్యాణమునకు, సహాయభూత మగు ప్రణాళిక భారతదేశమునుండి లభింపగల దని యోచనపరు లగు పాశ్చాత్యులు నిరీక్షించుచున్నారు. పాశ్చాత్యనాగరికతయొక్క భీకరస్వభావము పెంపొందుచునే యున్నది. "ఐరోపాజాతులు 1914వ సంవత్సరములో కంటె నేడెక్కువగ యుద్ధసన్నాహు లైయున్నారని మనము మరువకూడదు." అని ఇటలీడిక్టేటరు సీనియరు మస్సులోని పలుకుచున్నాడు. పాశ్చాత్యనాగరకత గాఢాంధకారమువలె ప్రపంచము నావరించియున్నను

power into the hands of rich newspaper proprietors, advertising producers and the energetic wealthy generally who are best able to flood the collective mind freely with the suggestions on which it acts.

*H. G. Wells: First and Last Things, p. 112.*

నేడు సుజ్ఞానభాస్కరుని కిరణములు ప్రాగ్దిశనుండి చొచ్చు
కొని వచ్చుచున్న వనుటకు నిదర్శనములు లేకపోలేదు.
హిందూదేశసందేశమునుగూర్చి "ఆచారవ్యవహారముల
యందు పరస్పర వ్యత్యాసములు గల పలు జాతులవారికి
ఉచితాతిథ్యమునే గాక నివాసస్థానము నిచ్చి సత్కరించు
గృహిణివలె హిందూదేశము ప్రవర్తించు చున్నది.
ఇందువలన అపారక్లిష్టపరిస్థితులు సమకూడు చున్నవి.
అవి వట్టి నేర్పరితనమువలన గాక సానుభూతివలనను,
సర్వమానవైక్యతను యథార్థరూపమున హృద్గతము చేసి
కొనుటమూలమునను పరిష్కరింప నగును. ఈ విశ్వమా
నవైక్యానుభవము కొరకు ప్రాచీన ఉపనిషత్కాలము
నుండి నేటివరకు అనేకమహాధర్మప్రవక్తలు ఉద్భవిల్లిరి.
వారందరి ప్రధానోద్దేశము ఈశ్వరానుభవవిశేషముచేత
భిన్నమానవులందలి సర్వభేదములను, అతిక్రమింప జేయు
టయే. నిజముగ హిందూదేశచరిత్ర రాజ్యముల పతనా
భ్యుదయములకును, రాజకీయాధికార సంపాదనకొరకు
జరిగిన యుద్ధములకును సంబంధించినది కాదు. హిందూ
దేశములో వాని వృత్తాంతములు నిరసనభావముతో
విస్మరింపబడు చున్నవి. ఏలయన నవి ఏవిధమునను భార

తీయుల యథార్థచరిత్రను వ్యక్తపరుపవు. భారతీయుల చరిత్ర వారి సంఘజీవనమునకును, ఆధ్యాత్మికధర్మసాధనమునకును సంబంధించినది."[1] అని రవీంద్రనాథుడు చెప్పు మాట లాశ గొల్పుచున్నవి.

"మతసంబంధముగ ప్రబలు మూఢవిశ్వాసము గాని, భౌతికజ్ఞానసంబంధముగ పెంపొందు ప్రాపంచికధోరణి

1. Her mission has been like that of a hostess who has to provide proper accommodation for numerous guests, whose habits and requirements are different from one another. This gives rise to infinite complexities whose solution depends not merely upon tactfulness but upon sympathy and true realization of the unity of man. Towards this realization have worked, from the early time of the Upanishads up to the present moment, a series of great spiritual teachers, whose one object has been to set at naught all differences of man by the overflow of our consciousness of God. In fact, our history has not been of the rise and fall of kingdoms, of fights for political supremacy. In our country records of these days have been despised and forgotten, for they in no way represent the true history of our people. Our history is that of our social life and attainment of spiritual ideals.

*Rabinaranath: Nationalism, P. 5.*

గాని జనింప జేయు వినాశకర మగు భావప్రాబల్యమును నిరోధించునది ఆధ్యాత్మికధర్మజీవనమె.* [1] అని పండిత రాధాకృష్ణ చేయు నుపదేశ మెల్లరకు అమృతప్రాయ ముగ నున్నది. చాల వెనుకపడి యధోగతి జెందియున్న దని సామాన్యముగ తలంపబడు భారతదేశము జగత్కల్యాణమునకు తోడ్పడగల ధర్మప్రచారమునకు కేంద్రస్థాన మై నేడు కూడ యావత్ప్రపంచ దృష్టిపథమున నిలచి యున్నది. పాశ్చాత్యులతోడి సంఘర్షణము ప్రారంభ మైన నాటినుండియు, భారతీయులయందు నిద్రాణ మై యున్న యాత్మశక్తి మేల్కాంచి ప్రాక్ప్రతీచీ సమన్వయ విధానముల నారయు చున్నది.

## ప్రస్తుతకర్తవ్యము

నవయుగవాతావతరణము ఎంత భయానకముగ గాన్పించు చున్నను, దానిని వినిర్మలము గావించి

1. Which (spiritual idealism) is opposed to the disintegrating forces of scientific naturalism on the one hand and religious dogmatism on the other.
*Radhakrishnan: An Idealist View of Life, P. 87.*

యావత్ప్రపంచవాసులను ఏకకుటుంబములోని వారివలె మార్పగల యుత్తమధర్మవిధానచిహ్నములు పొడగట్టు చు దైర్యోత్సాహముల పురిగొల్పు చున్నవి. భారత దేశము ఆత్మశక్తికిని, పాశ్చాత్యదేశములు సంఘశక్తి కిని ప్రాధాన్యత నిచ్చుచున్నవి. ఆత్మశక్తియందే దృష్టి నిలిపి సంఘమును త్యజించిన వికృతధర్మసాధకులు హిం దూదేశమున బయలుదేరుచు వచ్చిరి. కాని వీరి యస్వా భావికజీవనము ఎప్పటి కప్పుడు ఖండించుచు, ఆత్మీయ జీవనము సంఘమునందు వ్యాప్త మగుచు తద్వారమున అభివృద్ధిగాంచు నని హైందవప్రాజ్ఞులు నిరూపించుచునే యుండిరి. ధర్మసాధనకు సంఘము అత్యంతావశ్యక మగు దివ్యక్షేత్ర మని హిందూతత్త్వజ్ఞుల ముఖ్యసిద్ధాం తము. కేవలబాహ్యోపచారములు, శుష్కపూజాపున స్కారములు, అనుసరించుచు ధర్మనిష్ఠాపరులుగ పరిగ ణింపబడువారును హిందూదేశమున లేకపోలేదు. కాని భక్తిశూన్యము లగు కర్మలు సదా హిందూతత్త్వవేత్తల చే నిరసింప బడుచునే యుండెను. "భక్తిలేని పూజ

పత్రిచేటు" అను భావము సామాన్యజనులు కూడ నెరిగి నదె. జీవనమును స్వాభావికమార్గముల సంఘమునందు చిరనూతనవికాసము గావించుటకు హిందూధర్మము సదా ప్రయత్నించు చున్నది. భారతీయులయం దేమి, పాశ్చాత్యులయం దేమి, మానవు లందరియందు స్వార్థ పరత్వము శల్యాగతమై ఒకపట్టున విడువ కుండును. స్వార్థమును క్రమక్రమముగ నణగద్రొక్కుచు, విశాల మానవజీవనమునందు మిళిత మగుటకు, ధర్మసాధన మానవునకు తోడ్పడును. పాశ్చాత్యులు ప్రత్యక్షముగ గాన్పించు ప్రపంచశక్తుల నాధారపరచుకొని, స్వార్థ ప్రేరితు లయి యే దేశమునకు చెందిన వా రా దేశపు జాతిగ విజృంభించుచు ప్రపంచమునం దగ్రస్థానము బడ యుటకు నొకరితో నొకరు పోటిపడుచు, ద్వేషానలమున బడుచున్నారు. స్వార్థజీవనమును ఒకరిద్వారమున గాక, పలువురమూలమున పెంపొందించుటకు వలసిన శాసన ములు, కట్టుబాటులు నిర్మించి పాశ్చాత్యజాతులు స్వార్థ పరత్వమువలని నష్టమును వేయి మడుంగు లధికము

జేయు చున్నారు. పాశ్చాత్యసంఘములందు ప్రబలి యున్న స్వార్థచింతను బ్రద్దలుకొట్టగలిగినది ధర్మ మొక్కటియే. సంఘీభావము శ్రేయస్కర మైనది యనుటకు సంశయము లేదు. కాని అది స్వార్థముకొరకు తోడ్పడినయెడల మిక్కిలి యరిష్టదాయక మగును. ఇటులనే పాశ్చాత్యులు విశేషశ్రమపడి గడించిన భౌతిక విజ్ఞానము, యంత్రనిర్మాణకౌశలము, ప్రజాపరిపాలనా పద్ధతి స్వతస్సిద్ధముగ నిరపాయకరము లైనవే యైనను, స్వార్థబుద్ధితో నవి యలవరచుకొనుటమూలమున మహో పద్రవకరము లగుచున్నవి. పాశ్చాత్యులు భౌతికవస్తువు లను స్వాధీనపరచుకొని, మానవజీవితమును అనేక విధ ముల సుఖప్రదముగ జేసిరి. అమోఘ లగు సక్రమ పద్ధతులు, దుర్లంఘనీయము లగు నియమమ్ములు, నెల కొల్పి సంఘమును మహాశక్తివంతము గావించిరి. వారి యద్భుత ప్రయత్నములను గాంచినపుడు విస్మయము కలుగక మానదు. వారు భౌతికప్రపంచమునందు బడ సిన శక్తి సామర్థ్యములు త్యజించ తగినవి కావు. వాని నెల్ల ధర్మముతో సమ్మిళితము చేయుటయే ప్రస్తుతకర్త వ్యము. పాశ్చాత్యులయందు ప్రశంసనీయము లయియున్న

గుణవిశేషములను సంగ్రహించును వానియందు ధర్మము చొప్పించి మానవజీవితమును ఉన్నతపరుపగల మహోద్యమము హిందూదేశమున ఈ నవయుగము నందు నెవ్విధమున ప్రకటితమయ్యెనో ముందుప్రకరణ మున తెలుపబడును.

పకృత సమస్య

రామమోహనుడు

కేశవచంద్రుడు: దయానందుడు

రామకృష్ణుడు

ఆనిబెసెంటు

జగత్తునందు సృష్టిస్థిలయము లిమిడి యున్నవి. పుట్టి నది కొంతకాలము పెరిగి వినాశము జెందును. జన్మము తోపాటు మృత్యువు కూడ సిద్ధముగ నందును. జీవుల కాయుర్దాయము భేదించునె గాని, అవి యన్నియు నెప్పుడో యొకప్పుడు మృత్యువాత బడును. అవి పెంపొందు నప్పుడు ఆనందము, అంతరించు నప్పుడు దుఃఖము సామాన్యముగ కలుగును; కాని వర్ధిల్లుటవలె నశించుటయు సహజ మని గుర్తించుట యావశ్యకము. సృష్టి దేశకాలబద్ధ మయినది. దానియందు దేశాతీత మును అనంతమును అపరమితము నయినది పూర్తిగ నిముడుట యసంభవము. ప్రపంచమున నావిర్భవించునది సీమాబద్ధ మయి దేశకాలానుగుణముగ పరిణామము జెందక తప్పదు. కాని యావద్విశ్వము అనంతపరమే శ్వరాంశసంభూతమె; కావున నందలి సర్వము అనం తత్వమును ప్రకటించుచు సకలహద్దుల నతిక్రమింప గల శక్తి కలిగి యుండును. మరణముతో జననమును,

క్షయముతో వృద్ధియు వెనువెంటనె సంప్రాప్తము లగుచు, సృష్టిని చిరనూతనవిలసితము గావించు చున్నవి. ఎందరో మరణించుచున్నను, ఎందరో తిరిగి జన్మించుచు న్నారు. పతనము లెన్నికలుగుచున్నను, అభ్యుదయము లును మరల సంఘటిల్లుచున్నవి. ప్రాతగిల్లినవి నశించిన గాని, రూపాంతరము జెందినగాని, సృష్టిపరిణామము సాధ్య ము కాదు. ఒకప్పుడొక జాతి యంతరించినట్లుండును; కాని యావిలయమునుండియె నూతనజాతి యుద్భవిల్లును. అస్త మించినసూర్యుడు తిరిగి యెట్లుదయించునో అట్లే పతన ము జెందిన ప్రతిదేశము మరల నూతనరూపముతో తప్పక యభ్యుదయము గాంచును. పరిణామక్రమ మెరిగిన తత్త్వజ్ఞులు అంధకారమునందు ప్రకాశమును వినాశ మందు వికాసమును గాంచ గలరు. పాశ్చాత్త్యులతోడి సంపర్కమునాటికి భారతదేశము అధోగతి జెంది మత సాంఘిక రాజకీయాది సర్వవిషయములందు నత్యంతహీన స్థితిలో నుండెను. కాని నాడె నవ్యభారతోదయచిహ్న ములు పొడసూపెను. హైందవధర్మవాహిని భారతజాతి యందు శుష్కింపలేదు. పాశ్చాత్త్యులతోడి సంఘర్షణము ప్రారంభించినది మొదలు అంతర్గత మైయున్న ధర్మజీవ

నము కొందరు మహాపురుషుల జీవితముల ద్వారమున తిరిగి వెలువడి ప్రవహింప జొచ్చెను. ఆ ధర్మతరంగిణి నలుగడల విస్తరించి నిద్రాపరవశులైన భారతీయుల మేల్కొల్పి నూతనచైతన్య సంభరితుల గావించెను. వారు హిందూదేశపూర్వధార్మికౌన్నత్యమును స్మరణమునకు దెచ్చుకొను చున్నారు; ప్రాక్ప్రతీచీసంఘర్షణ ఫలితముగ ఈ నవయుగమందు నయితము హిందూదేశము ఉత్తమసమన్వయవిధానము ప్రకటింప గల దని యాశించు చున్నారు.

## ప్రకృత సమస్య

ప్రాక్పశ్చిమదేశీయుల విశిష్టగుణముల నారసి వానిని సమన్వయపరచి విశ్వజనీన మగు నూతన జీవనము నుద్భవిల్లజేయుట ప్రకృతసమస్య. "పాశ్చాత్యు లెన్నడును తమ జీవితముల నాధ్యాత్మికముగ మార్చుటకు శక్తివంతులు కాలే దనుట నిజము. ఇటీవల ఆర్థికరాజకీయాదర్శముల చేతను అవసరముల చేతను పురిగొల్పబడుచు బాహ్యప్రపంచమందు చాలవరకు కేవలకర్మపరతంత్రు

లగుట కలవడిరి. వారియందు ధర్మబుద్ధి యుదయించి యధికగభీరముగనో యుజ్జ్వలముగనో పరిణమింపకున్నను ఆధ్యాత్మికతృష్ణ మాత్రము విశేషవ్యాప్తి జెంది యున్నది. వారు కేవలము ప్రాపంచికవిషయములందె మెలగుచు యంత్రప్రాయము లగు విధానముల ననుసరించి యార్థిక రాజకీయదృష్టి గల జ్ఞానముతో చరించు జంతువులవలె తమ సమస్యలను పరిష్కరించుకొనవలసి వచ్చుచున్నది. ఏలయన వారు మరియొక దృష్టి నెరుగరు; ఇంకొక పద్ధతికి నలవడి యుండ లేరు. ఇక ప్రాగ్దేశీయులను చూతము. వారు మృతకర్మకలాపములందు తమ యాధ్యాత్మికజీవనము విశేషముగ శుష్కింప జేసినను నూతనప్రబోధములను గ్రహించుట కెల్లప్పుడాయత్తులుగ నుండిరి. తమ యాత్మీయశక్తిని భద్రపరచుకొనిరి. వారు నిజముగ జడప్రాయులై నిర్మాణశక్తిని కోల్పోయి నప్పుడు నయిత మట్టి స్థితియందె యుండిరి. కనుక ప్రాగ్దేశీయులు, పాశ్చాత్యులతోడి యనుదిన సంసర్గమువలన, తమ ప్రాచీనధార్మికజీవనమును ఆధ్యాత్మికవిశాలదృష్టిని సంఘనిర్మాణశక్తిని విజృంభింప జేసి రూఢము లై నిర్జీవము లై నిరుపయోగము లయిన

ప్రచలితమార్గములను గాక పరివర్తనాశీలము లై సచేత
నము లై యుపయుక్తము లగు నూతనమార్గముల నను
సరించి యాసియాఖండ దివ్యజ్యోతియొక్క ప్రకా
శమును పాశ్చాత్యఖండములందు వ్యాప్తము జేయు
దురని నేడు యావత్ప్రపంచ మాశించు చున్నది.
ప్రాగ్దేశముల కేంద్రస్థాన మయిన హిందూదేశము
కూడ పూర్వపశ్చిమఖండములందలి సకలేతర దేశములు
మారినటులనె తప్పక మార్పు జెందవలయును. ఐరో
పాఖండవాసుల సాంగత్యసంజనితము లగు సమస్యల కను
గుణముగ నదియు పరివర్తనము నొందక తప్పదు. ప్రాగ్దే
శీయుల యాధునికజీవనము నూతనపురాతనాదర్శముల,
అభినివేశముల తీవ్రసంఘర్షణముయొక్కయొ, సరళసమన్వ
యముయొక్కయొ ఫలితమై యుండును. కావున భారతదే
శములోని పూర్వసంప్రదాయానుచరులు పరివర్తనావసర
మును బాగుగ శిరసావహించు వారయినయెడల, ప్రబు
ద్ధభారతవర్షమునందు సుజ్ఞాన ముద్భవిల్లి తద్వారమున
ప్రపంచభావినాగరకత యొక విధ మగు సుందరగభీర

పరిణామముతో విలసిల్లును."[1] అని నవీన భారతయోగి పుంగవు డగు అరవిందుడు విశ్వసించు నట్లు హిందూదే

1. The West never really succeeded in spiritualising itself and latterly it has been habituated almost exclusively to an action in the external governed by political and economic ideals and necessities; inspite of the reawakening of the religious mind and the growth of a widespread but not yet profound or luminous spiritual and psychical curiosity and seeking, it has to act soley in the things of this world and to solve its problems by mechanical methods and as the thinking political and economic animal, simply because it knows no other stand point and is accustomed to no other method. On the other hand the East, though it has allowed its spirituality to slumber too much in dead forms, has always been open to profound awakenings and preserves its spiritual capacity intact, even when it is actually inert and uncreative. Therefore the hope of the world lies in the rearousing in the East of the old spiritual practicality and large and profound vision and power of organisation under the insistent contact of the West and in the flooding out of the light of Asia on the Occident, no longer in forms that are now static, effete, unadaptive, but in new forms stirred, dynamic and effective.

శము తన విధ్యుక్తకార్య మగు ధర్మసమన్వయమున కీ నవయుగమునందును గడంగి ధన్యత గాంచవలయును.

జగత్తు వాస్తవము. అది మిథ్య యని త్రోసిపుచ్చుటకు వలనుపడదు. ఇంద్రియగోచరము లగు సర్వవిషయములు యథార్థములు, సత్యద్యోతకములు. వానిని విస్మరించి జీవనము గడపుట దుర్లభము. కేవల లౌకికజీవనమె గాక యుత్తమధార్మిక జీవనము కూడ జగత్తు యొక్క యాథార్థ్యతను గమనించుచునె వర్తిల్లును.

India, the heart of the Orient, has to change as the whole West and the whole East is changing, and it cannot avoid changing in the sense of the problems forced upon it by Europe. The new Orient must necessarily be the result either of some balance and fusion or of some ardent struggle between progressive and conservative ideals and tendencies. If therefore the conservative mind in this country opens itself sufficiently to the necessity of transformation, the resulting culture born of a resurgent India may well brnig about a profound modification in the future civilisation of the world.

*The conservative mind: and Eastern Progress.*
*Aurobindo. Arya Vol. II. page 759.*

ఆకాసమునందలి యనంతనక్షత్రరాసులు, భూతలము లోని యసంఖ్యాకవస్తుజాలములు, జీవకోటులు ఏ మానవునకు విస్మయము గొల్పకుండును? వానియందు పొడగట్టు ననంతశక్తియు అపారజ్ఞానమును పరస్పరసంబంధమును ఏ మానవుని ధర్మజిజ్ఞాసునిగ మార్పకుండును? సృష్టియొక్క నిరంతరపరిణామశీలము ఏ మానవునియందంతులేని సత్యాన్వేషణతృష్ణను జనింపజేయకుండును? ప్రపంచమువలన కలిగెడు సుఖసంతోషములు, ఆత్మానుభవములు ఏ మానవునియందు నిర్మలభక్తిభావము పురిగొల్పకుండును? జగత్తు అనుదినజీవనమునకు, తత్త్వవిచారణమునకు, భక్తితత్పరతకు నాధారభూత మగుచు మానవులను ఈశ్వరవిశ్వాసుల జేయుచున్న దనుటకు సంశయము లేదు. ఏ యథార్థతత్త్వవేత్తయు జగత్తును తృణీకరించు మిథ్యావాదము సలిపి యుండలేదు. అద్వైతవాది యగు శంకరు డట్టి వాదము సలిపి యుండె నని సామాన్యముగ తలంపబడును; కాని శంకరుని వాదమది కా దని పండిత రాధాకృష్ణ నిరూపించి

యున్నాడు.[1] శంకరుని బోధ నర్థముచేసికొనని యాతని శిష్యులు కొందరు విపరీతశూన్యవాదములు చేసి యుం డిరి. భారత దేశమందు సుప్రసిద్ధజ్ఞానులు, భక్తులు, సాధ కులు జగత్తున కుచితప్రాముఖ్యత నిచ్చియే యుంపిరి. పంచభూతము లారాధ్యములు. మహత్తరపదార్థము లెల్ల స్తవనీయములు. మహాపురుషు లందరు పూజార్హులు. ఇట్టి గౌరవభావము జగత్తునెడల గలిగి తత్సాహాయ్య ముతో హిందూదేశభక్తులు ఈశ్వరోపాసన సలిపిరి. ప్రకృతి పార్వతీరూపమున ఈశ్వరుని నిత్యసహధర్మిణి యై యున్న దని హిందువులు భావించిరి. కనుక భారత దేశము ప్రపంచమును నిరసింపక తన్మహిమల వ్యక్తప రుప గల జ్ఞానాధికు లెల్లరను ప్రేమాస్పదులవలె పరిగ ణించును. పాశ్చాత్య దేశస్థులు భౌతికమహాత్మ్యముల కనుగొని వెల్లడించుటలో నతిసమర్థులు. వారికి ప్రశాం

1. Whenever he denies the reality of effects, he qualifies his denial by some such phrase as "different from Brahman" or "different from the cause." No where does he say that our life is literally a dream and our knowledge is a phantasm.
*Radhakrishnan: Indian Phylosophy Vol. II. p. 586.*

తవాతావరణము లేని కారణముసను, శరీరావసరముల దీర్చుకొను కృషియె వారిని సదా విడువ కుండుటవల నను, వారి దృష్టి గభీరత జెంద కుండెను. ఆధ్యాత్మిక దృష్టిని బడసిన భారతీయులు వారి విస్తృతప్రాపంచిక జీవనమునందు నూతనధర్మవిషయములను గాంచి వ్యక్తి పరచు నెడల, పాశ్చాత్యప్రతీచీసమ్మేళనమునకు సానుకూలపరి స్థితులు తప్పక చేకూరును.

భారత దేశము నేడు కేవలనూతనజీవనము ప్రారం భింప జాలదు; యుగయుగములనుండి స్రవించుచుండిన ధర్మధారనుండి విడివడ నేరదు; దాని యాధారమున దాని కనుగుణముగ పెంపొంది నవజీవనము బడసి యీ యుగమునందు శక్తివంతము కావలయును. విశ్వ మందలి వివిధపదార్థములందు, మానవాత్మయందు, పరమేశ్వరు డొక్కడే వెలకొని ప్రకాసించు చున్నా డని వేదకాలపు ఋషులు ప్రకటించిన సత్యమును గాని, జీవాత్మయొక్క భిన్నానుభవములు ఏక ధర్మజీవనము యొక్క క్రమాభివృద్ధి సూచకములే యని యుప నిషత్కారులు వెల్లడించిన సత్యమును గాని, మాన

వుడు ఈశ్వరానుభవమునకై యనుసరించెడు జ్ఞానభక్తి
కర్మమార్గములు మూడును అవినాభావసంబంధముతో
నాచరణమునందు మిళితమయి నప్పుడే సమగ్రధర్మజీవ
నము సమకూరగల దని భగవద్గీతారచయిత నిరూపిం
చిన సత్యమును గాని, అనుకూలసంఘటనలే గాక ప్రతి
కూలసంఘటనలు గూడ ధర్మవికాసమునకు సహకార
ములె యని తాంత్రికతత్త్వజ్ఞులు సమర్థించిన సత్యమును
గాని యేదియు త్యజింప నర్హాము గాదు. ఒక్కొక్కస
త్యము నిశ్చయించుటకు ధర్మపరాయణు లెంతయో
కృషి సల్పి యుండిరి. వారు గడించి సంచితము చేసి
యున్న జ్ఞానధనమును విడనాడుట కేవల మవివేకము.
వారు తెలిపియుండిన ప్రతిసత్యము ధర్మజీవనమును
క్రమోన్నతి జెందించుటకు తోడ్పడునదె; కావున
పూర్వమహనీయులు ధర్మసౌధమునం దే సోపానమువర
కారోహింప గలిగిరో యా సోపానమున ప్రకృతభారతీ
యధీశాలులు నిలచి నవయుగప్రేరణల కనుగుణముగ
మరియొక యున్నతశ్రేణి నెక్కుటయె నేడు జరుగవల
సిన యర్హాకృత్యము. ఈ నవీనకాలమున పూర్వ మెన్న
డును జరిగి యుండని యద్భుతకార్యములను పాశ్చా

త్త్వులు భౌతికసృష్టియందలి వివిధశక్తులసాహాయ్యముతో నిర్వహింప గలుగు చున్నారు. మానవశక్తి గాక సర్వాతీత మగు మహచ్ఛక్తి యేదో కృషి సలుపుటమూలమున జగత్తున సంఘటిల్లెడు ఘనకార్యముల గాంచుచు ప్రాచీనార్యులు ఆశ్చర్యామోదములు జెందిరి. బాహ్యజగత్తునందు విస్మయకరముగ వ్యక్త మయ్యెడు ఆ దివ్యశక్తియె తమ యంతరప్రపంచమునందును భిన్నకాంతులతో ప్రకాశించుచున్న దని వారు గ్రహించి యానందభరితు లయిరి. అంతియె గాని బాహ్యాంతరములందు నిహిత మైయున్న పరాశక్తి యొక్కటియె యని వారెంతగా గుర్తించి యీశ్వరసాక్షాత్కారము పొందియున్నను, జగచ్ఛక్తితో కలసి వారు నూతనసృష్టి కల్పించు సామర్థ్యమంతగా బడయ రైరి. ప్రపంచములో స్వాభావికముగ జరగు కార్యములను తమ శక్తిప్రయోగముచే మరింత శోభాయమానముగను వినోదకరముగను వారు మార్చి యా కృషిలో విశేషఖ్యాతిని, తత్త్వవిచారణమునందువలె, బడయ జాలక పోయిరి. పాశ్చాత్యనాగరికతె యావత్తు మానవశక్తి జగచ్ఛక్తితో నైక్య మగుచు ననేకనూతనసంఘటనలను ఘటింపజేయుటమూలమున

నేర్పడినది. పాశ్చాత్యదేశములలో నైసర్గికసృష్టి యేదో మానవనిర్మితసృష్టి యేదో వేరుపరచుట కష్టసాధ్యము. మానవునకు జగత్తుతో చేకూరిన యన్యోన్యజీవనము అత్యంతోపయుక్తముగ నున్నను, మానవుని దృష్టి ప్రపంచము నతిక్రమించి యావలకు పోనేరక యీశ్వర సాన్నిధ్యానుభవమునకు దూర మగుచున్నది. జగత్తును పరివర్తనము నొందింప గల తన శక్తిని మాత్రమె చూచుకొని మానవుడు గర్వించు చున్నాడు. మానవశక్తిని జగచ్ఛక్తిని పరస్పరసంబంధమున సమకూర్చుటకు ఆ రెంటి నతీతించి యా రెంటియం దంతర్నిహితు డయి యేకపరమేశ్వరుడు వెలయుచున్నాడను సత్యము ఈ నవయుగమున ప్రకటింపవలసి యున్నది. ఆ యుత్తమకర్తవ్యమును నిర్వర్తించుటకే నేటి భారతీయమహాపురుషు లుద్యుక్తు లయిరి.

## రామమోహనుడు

నవయుగధర్మసాధనకు గడంగిన వారిలో రాజారామమోహనరాయ్ ప్రథముడు. ఆతడు నవ్యభారతపితా

మహాను డని ప్రసిద్ధి జెందెను. ఆంగ్లప్రభుత్వము హిందూ దేశమున సుస్థిరముగ స్థాపిత మైనపిదప భారతీయులు పాశ్చాత్యుల యాచారవ్యవహారములను ప్రశాంతముగ పరిశీలించుట కవకాశము కలిగెను. పాశ్చాత్యుల దేశాక్రమణసామర్థ్యము, పరిపాలనాశక్తి, సాంఘికస్వేచ్ఛాచారములు హిందూదేశములో పలువురకు భీతావహములుగ నుండెను. హిందువుల మూఢవిశ్వాసములు, సాంఘికదురాచారములు, విచిత్రవేషభాషలు గాంచి పాశ్చాత్యులు విస్మయు లగుచు వారికి దూరముగ నుండిరి. భారతీయులు వట్టి యనాగరికు లని తలంచి వారి నుద్ధరించుటకు పాశ్చాత్యక్రైస్తవమతబోధకులు పాటుపడ మొదలిడిరి. తమ దేశము నాక్రమించుటయేగాక తమ యాత్మలను గూడ వశపరచుకొనుటకు పాశ్చాత్యులు పూనుకొని యున్నారని హిందూదేశవాసులు భావించి మరింత భీతిల్లు చుండిరి. పాశ్చాత్యవిద్య యనిన, నాగరికత యనిన, హిందువులు ద్వేషించు చుండిరి. ఆ పరిస్థితులు ప్రాక్పశ్చిమముల మైత్రి యసంభవ మను సామాన్యోక్తిని సార్థకపరచు చుండె నని చెప్పక తప్పదు. కాని విజ్ఞానవంతులును, ధర్మపరాయ

ణుడు నయిన రామమోహనుడు తన దివ్యదృష్టితో ప్రాక్పశ్చిమముల కలయిక నిశ్చయముగ సంభవమే యని నాడె గుర్తింప గలిగెను. ఆతడు మహమ్మదీయ క్రైస్తవ బౌద్ధ హిందూ మతాది మూలధర్మగ్రంథ ముల సమగ్రముగ పఠించెను. మానియర్ విలియమ్సు నుడివి నట్లు ప్రపంచమంతటిలో సర్వమతపరిశోధనకు గడంగిన వారిలో రామమోహనుడు ప్రథముడు. బాహ్యాచారములందు వివిధమతస్థు లెంతయో భేదించి యున్నను ఆధ్యాత్మిక జీవనవిషయమున నేకీభవించి యున్నా రని యాత డుద్ఘోషించెను. క్రైస్తవమతసా రాంశము వెల్లడించుటకు 'జీససుబోధనలు' అను గ్రంథ మును, మహమ్మదీయమత ముఖ్యసిద్ధాంతములు సువ్య క్తము చేయుటకు 'తుఫాతుల్ మువాహాద్దిక్' అను గ్రంథమును, హిందూమత ప్రభావమును ప్రకటించు టకు 'వేదాంతసారము' అను గ్రంథమును ముఖ్యముగ రచించుటయె గాక, అనేకమతవిషయక గ్రంథములను వ్యాసములను ప్రచురించి భిన్నమతావలంబకులు పరస్ప రమైత్రి నలవరచుకొనుటకు ప్రోత్సహించెను. కాన నాతడు నవయుగ ప్రథమ సమన్వయాచార్యు డని

ప్రసిద్ధి జెందెను. ఈశ్వరుని మరపించు విగ్రహాపూజ గాని, గురుభక్తి గాని, కర్మనిష్ఠ గాని ధర్మజీవనమునకు ప్రతిబంధక మని విస్పష్టముగ నిరూపించి మానవాత్మ సహజముగను స్వతంత్రముగను పరమేశ్వరునితో సాంగత్యలాభము బడయు గల దని ప్రధానమతకర్త లెల్లరు నుడివిన యుత్తమవచనముల నాతడు వివిధమతానుచరులకు సుబోధకము గావించెను. ఆతడు నూతనమతస్థాపకుడు గాడు. హిందూమతావలంబకుల కీరితిని చెప్పెను. "నా వ్రాతలయందు దేనిలో గాని యే వాగ్వాదములో గాని యీశ్వరుని యేకత్వ సిద్ధాంతము నేను క్రొత్తగ కనిపెట్టితి నని గాని సంస్కరించు చున్నా నని గాని యెప్పుడు చెప్పుకొని యుండ లేదు; సంస్కర్త ననియో నూతన మతస్థాపకుడ ననియో నామము ధరించియు నుండలేదు. అట్టిపేరులు పెట్టుకొనక పోవుటయె గాక, నే నిదివరకు ప్రచురించిన ప్రచురము లన్నిటిలోను ఈశ్వరు డొక్కడే యను సిద్ధాంతము మన ప్రాచీను లను సరించుటచేతను, ఇక్కాలమున నయితము విద్వాంసు లగు ననేక బ్రాహ్మణులకు బాగుగ తెలిసిన విషయమయి యుండుటచేతను, నే నది యథార్థహిందూసిద్ధాం

తమె యని వాదించితిని."[1] ఇవ్విధముననె యితర మతస్థులకును ఆతడు బోధించెను. సర్వమతములం దత ర్నిహితమై యేకమై విశ్వజనీనమై క్రమవికాసము గాంచుచున్న ధర్మమును వెల్లడించుటకు కృషి సలిపిన మహనీయు డాతడు.

నవయుగమున భౌతికపరిశోధనలకు మిగుల తోడ్పడుచు విజృంభించి యున్న హేతుజ్ఞానమును ధర్మముతో సమన్వయము చేయుటకును రామమోహనుడు పాటు పడెను. హేతుజ్ఞానము ధర్మవిషయపరిశీలనమునకును గడంగ వచ్చును; అందలి దోషముల నిర్మూలించుటకు యత్నింపవచ్చును. కాని హేతుజ్ఞానము స్థూలనేత్రము

1. In none of my writings, nor in any verbal discussion, have I ever pretended to reform or to discover the doctrines of the unity of God, nor have I assumed the title of reformer or discoverer; so far from such an assumption, I have urged in every work that I have hitherto published, that the doctrines of unity of God are real Hinduism, as that religion was practised by our ancestors, and as it is well known even at the present age to many learned Brahmins.
*Rammohun's English Works: page 90.*

లకు గోచర మయ్యెడు ప్రపంచవిషయము లెంత యథార్థము లని విశ్వసించునో అంత రాత్మకు విదిత మగు నాధ్యాత్మికవిషయములును అంతే యథార్థము లని యంగీకరింపవలెను. అప్పుడె యది ధర్మవిషయవిచారణమునకు యోగ్యత బడయును. ఋషులు, జ్ఞానులు మూలమున తమ యాత్మలమూలమున విస్పష్టముగ వినినట్టి విషయములు శ్రుతులను పేర పిలువబడు చున్నవి. కాలక్రమమున వెలవడు శ్రుతిపరంపర యంతయు కలసి సంప్రదాయముగ నేర్పడును; కాన సంప్రదాయము ప్రామాణ్యత వహించు చున్నది. అయినను దానియందు ప్రకృతి విరుద్ధవిషయము లెవ్వియు నుండుటకు వీలు లేదు. హేతుజ్ఞానము వానిని శోధించి విమర్శింపవచ్చును. కాని దానియందు ప్రకృత్యాతీత విషయముల కనుగొని నప్పుడు అవి బాహ్యదృష్టికి మించిన వని యెరింగి వాని యాథార్థ్యమును శంకింప కుండుట యుచితము. కావున హేతుజ్ఞానమును సంప్రదాయమును రెండును సత్యాన్వేషణమున కావశ్యకము లని రామ

మోహనుడు నిరూపించెను.[1] పదార్థశాస్త్రము, రసాయనశాస్త్రము మున్నగు భౌతికవిజ్ఞానశాస్త్రములు తన దేశస్థు లభ్యసించుట యత్యవసర మని విశ్వసించి యాంగ్లవిద్య గరపు విద్యాలయముల స్థాపింపవలయు నని ప్రభుత్వము వారిని గోరెను. అట్టి కళాశాల యొకటి ప్రతిష్ఠిత మగుట కాతడు ముఖ్యకారణుడుగ నుండెను విశ్వమునం దంతటను పరమేశ్వరుడు మహాశక్తివంతు డయి విస్తరించి యుండుటచే, ఆతనిపై నాధారపడి మానవుడు తన మనుగడ గడపుకొనవలయు ననుట వాస్తవము; కాని జగత్తునకు దోడగుచు జగత్తునందు నూతనసృష్టి విలాసము నేడు కల్పింప గలుగు చున్నాడు. జగత్తుతో కలసి మానవుడు మహాత్కార్యములు నిర్వర్తించు

1. The best method perhaps is, neither to give ourselves up exclusively to the guidance of the one or the other (tradition or reason); but by a proper use of the lights furnished by both, endeavour to improve our intellectual and moral faculties, relying on the goodness of the Almighty power, which alone enables us to attain that which we earnestly and deligently seek for.

*Rammohun's English Works: page 37.*

నప్పుడు వానియందు గర్భితమైయున్న శక్తి యపారముగ గన్పట్టును. ఆత్మజ్ఞానమునందు బ్రహ్మమును ప్రాచీనులు గ్రహించిన విధముననె, నవీనులు ఆత్మశక్తియందును పరమేశ్వరుని గుర్తించుట యావశ్యకము. భౌతికకార్యములద్వారమున నీకాలములో నధికతరముగ విజృంభించుచున్న మానవశక్తి యంతయు ఈశ్వరశక్తియె యని వ్యక్తపరచి తోడిజనులు భక్తిపరాయణులగుటకు రామమోహనుడు పాటుపడెను. ఆత్మపరిశోధనమూలముననె గాక ప్రకృతిపరిశోధనవలన గూడ బ్రహ్మదర్శనము గావింప వచ్చునని బోధించి యాతడు ప్రాక్ప్రతీచీ భిన్న ప్రవృత్తులకు సామరస్య మొనగూర్చెను.

బాహ్యకార్యములకు కారణభూతముగనున్న యాత్మశక్తియందు దృష్టి నిలిపి తద్వారమున పరమేశ్వరారాధనము సలుపుటలో సర్వమానవులు జాతిమతభేదములను పాటింపక యైక్యము కాగలరని యాతడు విశ్వసించెను. ఆత్మప్రబోధము గావించుకొనుచు నేకేశ్వరోపాసన సర్వమతములవారును సకలజాతులవారును గలసి

సంఘీభావముతో సలుపుకొనుటకు "ట్రిస్టుడీడు"[1] వ్రాసి యాతడు బ్రహ్మమందిరము నెలకొల్పెను. "ఆత్మానమేవ ప్రియముపాసీత"[2] అను నార్యఋషుల సందేశమునె ప్రకృతమున విపులార్థమునందు ప్రాక్ప్రతీచీ సమ్మేళనమునకును సర్వమత సామరస్యమునకును యావన్మానవ సఖ్యతకు నుపకరించురీతిని రామమోహనుడు వెల్లడించి లోక

1. that they...shall and do...permit and suffer the said messuage or building...... to be used...........for a place of public meeting of all sorts of and descriptions of people wlthout distinction as shall behave and conduct themselves in an orderly sober religious and devout manner for the worship and adoration of the Eternal Unsearchable and Immutable Being who is the Author and Preserver of the universe but not under or by any other name designation or title peculiarly used for and applied to any particular Being or Beings by any man or set of men whatsoever and that no graven image, statue or sculpture carving painting picture portrait or the likeness of anything shall be admitted within the said messuages building..."

*Rammohun's English Works: page 216.*

2. బృహదారణ్యకోపనిషత్తు III-4-8.

మునకు మహోపకార మొనర్చెను. ఆతడు సాంఘిక రాజకీయాది సంస్కరణములకొరకు ప్రారంభించిన యుద్యమము లన్నిటికంటెను విశ్వమానవైక్యతను సమకూర్చుటకు ఆతడు నెలకొల్పిన ధర్మసాధన మిగుల ముఖ్యమయినది. ప్రథమమున ధర్మోత్సాహము బడయుచు పరిశుద్ధహృదయముతో, విశ్వజనీనభావముతో భారతదేశాభ్యుదయమునకు తోడ్పడు సకలోద్యమములయందును తన దేశస్థులు కృషి సలుపవలయు నని యాతని యాశయము. "రామమోహనకాలమున పాశ్చాత్యులు ప్రాగ్దేశీయులపై దాడివెడలిరి. హిందూదేశస్థుల హృదయము భయకంపిత మయ్యెను. పాశ్చాత్యుల దరిమివేయు డను ధ్వనులె యంతటను సహజముగ వెలువడెను. కాని యవి పిరికిపందలు, బలహీనులు, అసమర్థులు పెట్టినట్టి యరపులు. రామమోహనుని మహామేధస్సు హిందూదేశముయొక్క పరమ ధార్మికాదర్శమెద్దియో దానిని ప్రకటించి పాశ్చాత్యులకు స్వాగతమొసంగెను. అట్టి సత్కారమును ఆతడు భారతజాతీయ జీవనమును త్యజించుటవలన గాక పాశ్చాత్యజీవనమును

స్వీకరించుటమూలమున గావించి యుండెను."[1] అని రవీంద్రుడు నుడివిన వచనములు రామమోహనుని ధార్మికోద్యమస్వరూపమును సువ్యక్తము చేయుచున్నవి.

కేశవచంద్రుడు : దయానందుడు

రామమోహనుడు చిరకాలాగతముగ హిందూదేశమందు ప్రవహించు చున్న ధర్మవాహినిని తన యుద్యమమున కాధారము జేసికొనెను; మరియు కాలానుగుణముగ దానిని విస్తృతపరచి ప్రాక్ప్రతీచీ సంగమమున కుపయుక్తము గావించెను. పాశ్చాత్త్యులు తమ భౌతిక

1, In the time of Rammohun Roy the West had come to the East with a shock that caused panic in the heart of India. The natural cry was for exclusion. But this was the cry of fear, the cry of weakness, the cry of the dwarf. Through the great mind of Rammohun Roy the true spirit of India asserted itself and accepted the West, not by the rejection of the soul of India, but by the comprehension of the soul of the West.

*Rabindranath: Letters to a Friend. page 177.*

విద్యయందు నద్భుతపాండిత్యము బడసి నిరంతరకృషితో ననేక నూతన విషయముల నారయు చున్నారు. వారు సచేతను లయి దినాదినాభివృద్ధి గాంచు చున్నారు. వారి ప్రాపంచిక నాగరికతను భౌతికవిజ్ఞానమును స్వీకరించి జీర్ణించుకొనుటకు భారతీయులు ప్రథమమున సజీవు లయి యుండవలెను; తమ బ్రహ్మవిద్యను ప్రదీప్తముగ నుంచుకొని యథార్థధర్మపరాయణు లయి యుండవలెను. సర్వమానవులందును సకలలౌకికప్రవృత్తులందును పరమేశ్వరుని సాక్షాత్కరింప గల దివ్యదృష్టి వారియందు తీక్ష్ణముగ నుండవలెను. "సర్వం ఖల్విదం బ్రహ్మ" [1] అను మహావేదోక్తి వారి జీవితములందు సర్వదా సార్థకమగు చుండవలెను. తాము మొదట నిజమయిన భారతసంతతివారివలె మెలగుట చాల ముఖ్యము. అప్పుడు పాశ్చాత్యజీవనాదర్శముల స్వీకరించుటకును, తమ జీవనమునందు విలీనము జేయుటకును శక్తివంతు లగుదురు. మరియు తమవలె పాశ్చాత్యులు కూడ ప్రాచ్యధర్మభావముల గైకొని యభ్యున్నతి గాంచుటకు మార్గదర్శ

1. చాందోగ్యోపనిషత్తు III-14-1.

లగుదురు. రామమోహనుడు కనపరచిన జాతీయపరి
ణామవిధానము ననుసరించి ఆతని యనుచరులు మొ
దట పట్టుదలతో పాటుపడుచు వచ్చిరి. మహర్షి దేవేంద్ర
నాథుడు మున్నగు వారు రామమోహనుని యడుగు
జాడల చరించిరి.

స్వీయ ప్రాచీన గ్రంథపఠనముతో బాటు అన్య
నవీన గ్రంథాధ్యయనమందు నిమగ్న మగుట, ధర్మ
గ్రంథములందె గాక భౌతికశాస్త్రములందు పాండిత్యము
బడయుట దేవేంద్రనాథుని జీవితమున నుజ్వలరూపమున
గానబడు చుండెను. ఆతని మేజాబల్లమీద క్రైస్తవ
మతగ్రంథ మొకటి యుండుటను గాంచి హిందూగ్రంథ
పారాయణమె యాతడు సదా సలుపుచుండు నని తలం
చిన ప్రతాపచంద్ర మజుందారు ఆతనికి క్రైస్తవమత
ముతో ప్రసక్తి యేమి యని ప్రశ్నింపగా, ఆతడు
"నేను భూమిమీద నడచునప్పుడు నేను నడచు భూమి
యొక్క నలువైపుల నుండు గట్లను చూచు చుండు
వాడను. ఈ భూమి యొకరిదనియు, దీనికి నలువైపుల
గట్లు గల వనియు, దీని కావలనుండు భూమి యింకొకరి

దనియు, దానికి నలువైపుల గట్లు గలవనియు దలంచు చుండువాడను. కాని భూమిని వదలి కొంచెము పై కేగు నప్పటికి చిన్నచిన్న గట్లవలన వేరువేరుగా గాన్పించిన భూప్రదేశము లన్నియు నొకరివిగనె కాన్పించు చున్నవి.''[1] అని ప్రత్యుత్తర మొసంగెను. దీని భావము స్పష్టముగనె యున్నది. రామమోహనుని ప్రథమానుచరులు జాతీయతను విడనాడకయె విశ్వజనీనతను కూడ నలవరచుకొనిరి.

కాని దేశమందు పాశ్చాత్యవిద్య వ్యాపించినకొలది ఆంగ్లవిద్యాధికులలో పాశ్చాత్యనాగరికతా వ్యామోహము హెచ్చెను. ఆంగ్లేయుల వేషభాషలు, నడవడికలు మర్యాదలు అనుకరింపబడు చుండెను. అంతియే గాక క్రైస్తవసంప్రదాయసిద్ధము లగు భావములు, అభ్యాసములు, ఆంగ్లసారస్వతమందలి సాదృశ్యములు, వర్ణనలు, పదములు సయితము, వాడుకలోనికి వచ్చెను. ఒకవిధ

బాబు అశ్వినికుమారదత్తు విరచిత భక్తియోగము.
(ఆంధ్రానువాదము) పుట. 14.

ముగ విద్యావంతుల మనస్సు నవయుగవాతావరణము వలన నాంగ్ల మయ్యె నని నుడువవచ్చును. ఈ యాంగ్ల మానస సంభవులకు హిందూధర్మగ్రంథములతోడను, హిందూసాంప్రదాయికజీవనముతోడను సంబంధము విడి పోయెను. మీదు మిక్కిలి భారతీయ సంస్థలందును భారతజాతియందును వారి కత్యంతవిముఖత్వము జనించెను. తాము హిందువులము కామని చెప్పుకొనుటయె ఘనమని తలంచు విపరీతబుద్ధి కూడ వారిలో వ్యాపింప జొచ్చెను. గౌరవకుటుంబములకు జెందిన కొందరు వాస్తవముగ హిందూసంఘమును విడిచి క్రైస్తవసంఘమున జేరిరి. అంతగా పైకి మార్పు జెందకున్నను, ఆంగ్ల విద్యార్థికు లందరు సాధారణముగ నా ధోరణితో చరించుచుండిరి. అట్టివారిలో కొందరిని పాశ్చాత్యవిజ్ఞానమును క్రైస్తవధర్మజీవనము నాదరించు చున్న బ్రహ్మసమాజము ఆకర్షించెను. బ్రహ్మనంద కేశవచంద్రసేను వారిలో ముఖ్యుడు. ఆతడు ధర్మతృష్ణతోడనె బ్రహ్మసమాజమున జేరి విశేషకృషి సలిపియుండెను; కాని యాతని ప్రథమ ప్రచారవిధానము పాశ్చాత్యవిద్యాగరిమతో విలసిల్లెను. ఆంగ్లభాషలో క్రైస్తవభావముల పురస్క

రించుకొని మహోపన్యాసముల నాతడు గావించు వాడు; క్రైస్తుబోధనల ద్వారా, ప్రాక్ప్రతీచీసమ్మేళనమునకై యత్నించు వాడు.[1] పలువురు విద్యావంతులు ఆ ప్రసంగములచే పరవశు లగుచు బ్రహ్మసమాజికు లయిరి. క్రైస్తవమతమున జేరు నుత్సాహము కేశవచంద్రుని వంటి ప్రముఖుల ధర్మప్రచారమువలన విద్యాధికులలో నరికట్టబడెను. బ్రహ్మసమాజికులు సాధారణముగ సంఘసంస్కరణవిషయములం దెక్కుడు పాటుపడ జొచ్చిరి; చాలవరకు పాశ్చాత్యపద్ధతుల ననుదినజీవితములో నలవ

1. In Christ we see not only the exaltedness of humanity, but also the grandeur of which Asiatic nature is susceptible. To us, Asiatics, therefore, Christ is doubly interesting, and his religion is entitled to our peculiar regard as an altogether Oriental affair. The more this great fact is pondered, the less I hope will be the antipathy and hatred of European Christians against Oriental nationalities, and greater this interest of the Asiatics in the teachings of Christ. And thus in Christ, Europe and Asia, the East and the West, may learn to find harmony and unity.

*Keshub: Lectures in India, page 22.*

రచుకొను చుండిరి. వీరు గావించెడు ఈశ్వరోపాసనలు సయితము క్రైస్తవప్రార్థనల నెక్కువగా పోలియుండెను. దేవేంద్రనాథుడు క్రైస్తవపుస్తకము తాకునా యని యితరులు సంశయించు నంతగా, ఉపనిషత్తులు మొదలగు హిందూగ్రంథములను వాడెడు వాడు. ఆ స్థితి మారి బ్రహ్మసమాజికులు హిందూగ్రంథములను త్యజించి క్రైస్తవ గ్రంథములందె నిమగ్నులై యుందు రని తలంపబడెను. స్వామి దయానంద సరస్వతి కేశవచంద్రసేను మున్నగు బ్రహ్మసమాజప్రముఖులను కలకత్తానగరమునకు వచ్చి దర్శించి యుండెను. వీరిని గురించి తనకు గలిగిన యభిప్రాయము నీ తీరున తెలిపెను. "వీరు ఆర్యావర్తములో జన్మించి ఆర్యావర్త మొసంగు సర్వము సదా గ్రహించి జీవించుచు తమ పూర్వపితామహుల ధర్మమును విడనాడిరి; దానికి బదులు విదేశీయమతముల నెడ నత్యంతాభిమానముతో వర్తింతురు. స్వదేశసంస్కృతభాషాజ్ఞాన మే మాత్రము లేకున్నను మహాపండితుల మని చెప్పుకొనుచు తమ యాంగ్లభాషాపాండితీప్రకర్షముతో నొక నూతనమత

స్థాపనమునకు వేగిరిపడు చున్నారు." నాడు దయానం
దుడు విమర్శించినటులనె రవీంద్రనాథ ఠాకూరు
బ్రహ్మసమాజకుల వింతజీవనమును గురించి గోరానవల
లో ననేకవివరములతో వర్ణించి యుండెను. దేవేంద్రనా
థుని తరువాత ఆతని శిష్యులు, పుత్రులు, ముఖ్యముగ
రవీంద్రనాథఠాకూరు, రామమోహనుని యుద్యమమున
కనుగుణముగ జాతీయతను కాపాడుకొనుచు విశ్వజనీన
జీవన మలవరచుకొనుటకు పాటుపడుచువచ్చిరి. బ్రహ్మ
సమాజికులలో నప్పటి మిగతవా రెల్లరు ఆంగ్లవిద్యనె
యభ్యసించుచు కేవలపాశ్చాత్యనాగరకతా ప్రవాహ
మున బడి రని చెప్పవచ్చును.

1. Though these men are born in *Aryavarta* have lived on its products and are still doing the same, yet they have renounced the religion of their forefathers and are, instead, inclined too much towards foreign religions, call themselves scholars, while they are quite destitute of indigenous *Sanskrit* learning, and pluming themselves on their knowledge of English, have been so precipitate in founding a new religion.

*Dayananda: Light of Truth, page 468.*

ఇది యిట్లుండ, దయానందుడు వేదములందె సంపూర్ణ జ్ఞానము గల దనియు, హిందువు లితరులనుండి నేర్చుకొనవలసిన దెద్దియు లే దనియు తెలుపుచు సంకుచిత జాతీయభావమును ప్రచారము చేయుటయె గాక హిందూసంఘమందలి మతసాంఘిక దురాచారము లన్నియు వేదప్రమాణముతో తీవ్రముగ ఖండించి వైదికధర్మమును పునరుద్ధరించుటకై ఆర్యసమాజమను మరొక సంస్థను స్థాపించెను. సత్యమును యథార్థముగ గోరితి రేని, వైదికధర్మ మవలంబింపు డని యెల్లరకు బోధించెను.[1] బ్రహ్మసమాజమును ఆర్యసమాజమును నిర్వర్తింప బూనిన సంస్కరణములు దాదాపుగ సమానమె యయినను, బ్రహ్మసమాజము ఆంగ్లవిద్యాధికులకును, ఆర్యసమాజము హిందూసంప్రదాయానుచరులకును హితములుగ నుండెను. అవి తలపెట్టిన సంస్కారోద్యమములు కొంతవరకు నెరవేరి సంఘోన్నతికి తోడ్పడెను. ఈ యిరుశాఖలమూలమున సంస్కృతగ్రంథాధ్యయన

1. If you are sincerely desirous of getting hold of truth, embrace the Vedic Religion.
*Dayananda; Light of Truth, page 718.*

మును ఆంగ్లగ్రంథపఠనము ప్రత్యేకముగ విశేషరూపమున జరిగెను; తీవ్రస్వజాత్యభిమాన మొక వంకను అపూర్వవిశ్వజనీనత మరియొక వంకను పెంపొందెను. కాని యవి సహజజీవనమును సమగ్రవికాసము పెంపొందించుటకు సాయపడవయ్యెను.

### రామకృష్ణ పరమహంస

విద్యార్థికుల దృష్టి వినిర్మలత జెందినకొలది బ్రహ్మసమాజముతోడ గాని ఆర్యసమాజముతోడ గాని తృప్తి జెంద కుండెను. ఇట్టి యసంతుష్టితోడనె బ్రహ్మసమాజమునందు సభ్యుడై యుండిన వివేకానందుడు దానికి విముఖు డయ్యెను. ఆతనికి రామకృష్ణపరమహంస శరణ్యు డయ్యెను. బ్రహ్మసమాజనాయకుడుగ సుప్రసిద్ధి జెందిన కేశవచంద్రుడు సయితము రామకృష్ణపరమహంసయొక్క సరళమగు గభీరభక్తికి పరవశుడై యాతని

1. See The life of Vivekananda p. 207.
(Advita Ashrama Publication)

నాశ్రయించెను. కేశవచంద్రు డాతనిని స్తుతించుచు పత్రికలో వ్రాయువరకు కలకత్తా విద్యావంతు లాతనిగురించి యేమియు నెరుగరు. దక్షిణేశ్వరమున కరిగి యాతని ధర్మోపదేశముల నాలకించుటయె గాక యాతనిని స్వగృహమునకు తోడ్కొని వచ్చియు నదీవిహారమునకు గొనిపోయియు కేశవచంద్రుడు ధర్మవిచారణము సలిపెడు వాడు. వా రిరువురు గాఢానురాగబద్ధు లయిరి. తన్మూలమున కేశవచంద్రునియందు గొప్ప పరివర్తనము గలిగెను. పూర్వధోరణి మార్చుకొని హిందూసంప్రదాయము ననుసరింప మొదలిడెను. ఈశ్వరుని మాత యని కూడ బోధించుటకును, సర్వమతములు సత్యములె యని చాటుటకును లక్ష్మి,సరస్వతి, జగద్ధాత్రి మున్నగు నామములు వేర్వేరు దేవతలను గాక యేకేశ్వరుని భిన్న లక్షణములను వ్యక్తీకరించు నవియె యని గుర్తించి యా వివిధనామములతో ఈశ్వరారాధనము సలుపుటకును, అగ్నియందు, నదియందు, సర్వభూతములయందు ఈశ్వరప్రత్యక్షదర్శనము పొంద యత్నించుటకును ప్రారంభించెను. ఈ తీరున మార్పు జెందిన కేశవచంద్రుడు బ్రహ్మసమాజికులలో పలువుర ఖండనకు పాత్రు

డయ్యెను. కాని యాతడు పరిశుద్ధాస్తికసిద్ధాంతములకు దూరుడు కా లేదని యాతని సమసాధకులును అనుచరులును నేటివరకు వాదనలు సలుపుచు నాతనిని సమర్థింపవలసిన యవసరము కలిగెను. ఆతడు మొదట నేర్పిన పాఠములనె బ్రహ్మసమాజకులు వల్లెవేయుచు ఆతనికి గూడ నప్పగింప గలిగిరి. కాని యాతని పరివర్తనమును గుర్తింప గల గభీరచింతనము వారియందు మృగ్యమయ్యెను. రామకృష్ణపరమహంస సాంగత్యమువలన కేశవచంద్రునియందు ఈశ్వరభక్తి సజీవమై సహజవికాసము గాంచె ననుటకును, భావప్రకటనము స్వాభావికమై స్వతంత్రశైలి బడసె ననుటకును సందియము లేదు. రామకృష్ణపరమహంస యుదారధర్మజీవనము వ్యక్తపరచుటలో నత్యుత్తమసిద్ధపురుషుడుగ రాను రాను ఆంగ్ల విద్యాధికులచే నంగీకరింపబడు చున్నాడు.

వివిధమతస్థులను జూచి నప్పుడు వారిసిగూర్చి మన మెవ్విధమున తనపోయవలెనో సూచించుటకు రామకృష్ణపరమహంస యిట్లు బోధచేసి యుండెను. "కొందరు గ్రుడ్డివా రొక యేనుగువద్దకు పోవుట తటస్థించెను. అది

యెట్లున్నదో చెప్పు డని వారిని మరొక రడిగిరి. ఏనుగు కాలును తడవిన గ్రుడ్డివాడు "ఏనుగు స్థంభమువలె నున్నది" అని చెప్పెను. రెండవవాడు "ఏనుగు చేటవలె నున్నది" అని చెప్పెను. వీడు దాని చెవును తాకి పరిశీలించెను. ఇటులనె దాని తొండమును పొట్టను పట్టి చూచిన వారు వేర్వేరు విధముల దానిని వర్ణించిరి. ఈశ్వరుని విషయమునను ఇంతే. ప్రతిమనుష్యుడు స్వానుభవము ననుసరించి ఆయనను భావనచేయును." 1 భిన్నమతములు భిన్నము లయిన యీశ్వరానుభవముల వెల్లడించు నని రామకృష్ణపరమహంస చెప్పి నప్పుడు,

1. Some blind men happened to come accross an elephant. Some one told them what it was and asked them to describe it as it seemed to them. The one who touched the leg said. 'The elephant is like a column.' The second one said, 'The elephant is like a winnowing fan.' He had felt one of its ears. Similarly, those who had touched its trunk or belly gave different opinions. So with God, every one conceives him according to his experience.

*Life of Sri Ramakrishna: page 304.*
(Advaita Ashrama Publication.)

ఆయన యాధ్యాత్మికదృష్టి యెంత విశాలత జెందెనో స్పష్టపడుచున్నది. "లీలద్వారమున నిత్యుని గ్రహించు టకు ప్రయత్నింపుము. లీలద్వారముననె నిత్యుని చేరు మార్గము నీ వన్వేషింప వలయును. మరల నిత్యునినుండి లీలను చేరుటకు దారిని నీవు వెదుకవలయును." అని యాయన యుపదేశించి యీశ్వరధ్యానమునకును లౌకిక జీవనమునకును గల యన్యోన్యసంబంధమును కనపరచెను. ఆయన మహామ్మదీయ క్రైస్తవ సాధనలను కూడ హిందూసాధనలతో పాటు సలిపి యన్నియు నేకోద్దే శమునె కలిగి యున్న వని స్వానుభవమువలన తెలిసి కొనెను. "ధర్మజీవనము రామకృష్ణునియందు మూర్తీభ వించినది. ఆయనబోధనలు కేవల విద్వాంసుని బోధ నల వంటివి గావు. అవి జీవనగ్రంథములోని పుటలు. అవి యాయనస్వానుభవములను వ్యక్తపరచును. అవి పాఠకుని పరవశుని గావించి వాని మనస్సున ముద్రి తము లగును. అవిశ్వాసము ప్రబలి యున్న యీ కాల మున నాచరణముతో గూడిన ప్రజ్వలవిశ్వాసము దృష్టాంతరూపమున రామకృష్ణుడు ప్రదర్శించుచున్నాడు. ఆ దృష్టాంతమువలన స్త్రీపురుషు లనేకులు ఆత్మశాంతి

బడసిరి. అది లేనియెడల వా రెల్ల రాధ్యాత్మికజ్ఞానము
నకు దూరు లై యుండెడి వారు"[1] అని గాంధిమహాత్ము
డభిప్రాయపడు చున్నాడు. హిందూదేశమున సహజ
రీతిని ధర్మ మెట్టి స్వరూపము దాల్చునో యయ్యది
రామకృష్ణపరమహంసద్వారమున వెల్లడి యయ్యెను.
సామాన్యజనులె గాక ఆంగ్లవిద్యాధికులు కూడ ఆయ
నచే నాకర్షింపబడిరి. వివేకానందుడు ప్రధానశిష్యు డై
యాయనసందేశము ప్రచారము చేసెను. సోదరి నివే
దిత మొదలగు పాశ్చాత్యులు రామకృష్ణుని యనుచరు
లైరి. రామకృష్ణప్రచారకసంఘము నెలకొల్పబడి తద్వా
రమున నొక మహోద్యమము వెలువడెను.

1. Ramakrishna was a living embodiment of godliness. His sayings are not those of a mere learned man but they are pages from the book of life. They are revelations of his own experiences. They therefore leave on the reader an impression which he cannot resist. In this age of scepticism Ramakrishna presents an example of a bright and living faith which gives solace to thousands of men and women who would otherwise have remained without spiritual light.
*Foreword to Life of Sri Ramakrishna by Mahatma Gandhi.*

సాధారణముగ హరినామము సంకుచితార్థమున వాడబడుటచే, బ్రహ్మసమాజికు లొకప్పుడు తమ యీశ్వరోపాసనలయందు దాని నుచ్చరించుట తప్పుగ పరిగణించిరి. కాని దాని విశాలార్థము వారు గమనించి దానిని కాలక్రమమున వాడుకలోనికి దెచ్చిరి. రామకృష్ణపరమహంస కాళీనామమునె గాక కాళీవిగ్రహమును కూడ విశ్వజననిని సూచించు చిహ్నములుగ పరిగ్రహించెను. అంతర్భావమునకు బాహ్యప్రకటనము గోరుచున్న సర్వసాధకులు రామకృష్ణపరమహంస కనపరచిన మార్గమునె యనుసరించుట సమంజసము. రామకృష్ణుని పథమునకు రామమోహనుడు ప్రతికూలుడు గాడు. విగ్రహములు మున్నగునవి పరమేశ్వరుని ప్రకటించు చిహ్నములుగ వాడుకొనబడు చున్నయెడల ఆ విషయము పరిశీలనార్హ మయినదె యనియు, కాని యవి యట్లు గాక వివిధములగు నుపాస్యదేవతలుగ ప్రస్తుతము హిందువులు భావించు చున్నా రనియు, యథార్థముగ నొక్కడై వెలుగొందు చున్న పరమేశ్వరుని గూర్చిన సంభావనాజనితములగు రూపకల్పనల నుండియె విగ్రహార్చనావిధానము లన్నియు నుత్పన్న

మయిన వనుటకు సందేహము లేక పోయినను, నే డది యంతయు హిందువులు మరచి పోయినందున వారి కా సంగతి ఋజువు చేయుటకె తాను సర్వవిధముల పాటు పడు చున్నానని యు రామమోహనుడు వెల్లడించెను.[1] ఉపాసనకు సమావేశ మగుచున్న జనుల మనోగతులను

1. I have observed, that both in their writings and conversation, many Europeans feel a wish to palliate and soften the features of Hindoo idolatry; and are inclined to inculcate, that all objects of worship are considered by their votaries as emblematical representations of the Supreme Divinity. If this were indeed the case, I might perhaps be led into some examination of the subject; but the truth is, the Hindoos of the present day have no such views of the subject, but firmly believe in the real existence of innumerable gods and goddesses, who possess, in their own departments, full and independent power; and to propitiate them, and not the true God, are temples erected and ceremonies performed. There can be no doubt, however, and it is my whole design to prove, that every rite has its derivation from the allegorical adoration of the true Deity; but at the present day all this is forgotten, and among many it is even heresy to mention it.

*Rammohun's English Works, page 4.*

బట్టి, ఉపాసనయం దుపయోగింపబడు నామరూపముల విషయమున రామమోహనుడు కొన్ని నిషేధములను పాటించుట యవసర మని నియమించెను. అంతియ గాని సాధకులు ఏ నామము నయినను ఏ విగ్రహము నయినను ఏ యితరచిహ్నము నయినను పరబ్రహ్మమును వెల్లడించు సాధనముగ నుపయోగించుకొనుటకు ఆతడు ప్రతికూలుడు గాడని నిశ్చయముగ జెప్ప వచ్చును. ప్రతిమ నుపయోగించినంతనె ఆత్మయోపాసన యసంభవ మని, వాగ్రూపమున ప్రార్థన చేసినంతనె ఆత్మయోపాసన సంభవ మని తలంచుట పొరపాటు. ఆత్మయోపాసన ప్రతిమద్వారమునను సలుపవచ్చునని నవయుగవిద్యాధికులకు రామకృష్ణుడు వెల్లడించెను.

అనిబెసెంటు

రామమోహనుడు, దేవేంద్రనాథుడు, కేశవచంద్రుడు, దయానందుడు, రామకృష్ణుడు వివేకానందుడు మున్నగు భారతీయభక్తాగ్రేసరులు సలిపిన ప్రబోధము పాశ్చాత్యుల దృష్టిని హిందూదేశమువంకకు మరలిం

చెను. రామమోహనుడు, కేశవచంద్రుడు, వివేకానం
దుడు పాశ్చాత్యఖండముల కరిగి ధర్మప్రసంగములు
గావించి నప్పుడు అచ్చట వానిని స్వయముగ వినిన
పాశ్చాత్యులు వారి భక్త్యుత్సాహములకు విస్మితు
లయిరి; ఆమహనీయుల జన్మభూమి యగు భారతవర్ష
మును ప్రశంసింప జొచ్చిరి. పాశ్చాత్యులలో కొందరు
వారి శిష్యగణములో కూడ జేరిరి. వా రెవరి యనుచరు
రాలు కాక పోయినను, అనిబెసెంటు దొరసాని హిం
దూదేశముయొక్క యౌన్నత్యమును బాగుగ గుర్తించి
తన యాంగ్లదేశమును విడిచి వచ్చి హిందూదేశమును
మాతృభూమిగ జేసికొనెను. ప్రపంచ సంస్థ యగు దివ్య
జ్ఞానసమాజమునకు దానిని కేంద్రస్థానముగ జేసి
తద్ద్వారమున దాని కత్యంతప్రాముఖ్యత దెచ్చెను.
మానవసేవ చేయుటయె జీవితపరమావధిగ గలిగి తన
సర్వశక్తులను లోకకల్యాణమునకై వినియోగించిన అని
బెసెంటు తన యుద్దేశ్యసాఫల్యమునకు దివ్యజ్ఞానసమా
జము మిగుల తోడ్పడగలదని యందు జేరి తద్వ్యా
ప్తికై మరణపర్యంతము పాటుపడెను. "జాతిమతభేద
ములు పాటించని సర్వజనసౌభ్రాత్రము నెలకొల్పుట,

ఆర్యసారస్వతతత్త్వజ్ఞానముల పరిశోధనను పెంపొందిం
చుట, సృష్టిలో దురవగాహము లై యున్న నియమము
లను, మానవునియందు గర్భితము లై యున్న యాత్మీ
యశక్తులను పరిశీలించుట, ఇవిదివ్యజ్ఞానసమాజముయొక్క
మూడు ముఖ్యోద్దేశములు"[1] అని ప్రశంసాపూర్వకముగ
దివ్యజ్ఞానమునుగూర్చి యామె తెలుపుచుండెను. తాను
నిరీక్షించుచుండిన యాత్మశాంతి దివ్యజ్ఞానసమాజము
ద్వారా లభించె నని యానందించెను. శాఖోపశాఖలుగ
దానిని ప్రపంచమం దంతటను వ్యాపింప జేసెను.
సంస్కృతపండితుల సాంగత్యము చేసియు, స్వయముగ
హిందూగ్రంథముల పరిశోధించియు, హిందూ ధర్మ
ముఖ్యాంశములు అంతకంతకు జక్కగ దెలిసికొనుచు
వానిని పత్రికాగ్రంథముల ద్వారమున లోకమునకు

1. The three objects of which (the Theosophical Society) are: To found a Universal Brotherhood with-out distinction of race or creed; to forward the study of Aryan literature and phylosophv; to investigate unex-plained laws of nature and the psychal powers latent in man.

*Annie Besant: (Autobiography) page 352.*

జాటెను. ఉత్తమహిందూగ్రంథ మగు భగవద్గీతను తాను కూడ నాంగ్లమున ననువదించి విశేషవ్యాప్తికి దెచ్చెను. కాశీనగరమున సెంట్రల్ హిందూకాలేజిని నెలకొల్పి సాధారణవిద్యతో బాటు విద్యార్థులకు హిందూధర్మశిక్షణము కూడ లభించు నేర్పాటుల జేసెను. ఆ కళాశాలయె ప్రస్తుతము హిందూవిశ్వవిద్యాలయముగ పరిణమించి మదనమోహనమాలవ్యపండితుని దక్షత క్రింద వర్థిల్లు చున్నది.

అనిబిసెంటు సలిపిన కృషిమూలమున భారతదేశములో ధర్మసాధనవిషయమున ఈ నవీనకాలములో చేకూరిన పరివర్తన మొకటి ముఖ్యముగ గమనింప దగినది. దివ్యజ్ఞానసమాజము జాతిమతభేదము లేమాత్రము పాటింపని సర్వజన సోదరభావము పెంపొందించుటకు స్థాపింపబడినది[1] యగుటచే, దివ్యజ్ఞాన సమాజికులు

1. And because the Theosophical Society knows no limit of creed, no limit of religion, and declares that every human being is, in his own essential nature, one with the Supreme Life and the Supreme

అన్ని విషయములలో వలె ముఖ్యముగ మతవిషయము లోను ఉదారస్వభావులును సహనశీలురు నయి యొక మతమువారు మరొక మతము వారి చిహ్నములను సాధనములను మన్నించి వానికి దూరముగ తొలగక వాని నర్థము చేసికొనుచు వినియోగించుకొనుటకు గూడ నభ్యసించు చున్నారు. చెన్నపురి అడయారులో వివిధమతస్థులు దేవాలయము, చర్చి మున్నగు నారాధనమందిరము లెవరివి వారు ప్రత్యేకముగ కలిగియుండిరి. మరియు వారికి అందరు కలిసి యుపాసన జరుపుకొను మండప మొకటి కలదు. అందు బుద్ధునియొక్కయు, క్రైస్తు యొక్కయు, ఇతరమతకర్తలయొక్కయు, ముఖ్యమతముల యాదర్శసూచకము లగు చిహ్నములయొక్కయు చిత్తరువులు గోడలపై చిత్రింపబడెను. అవి యాత్మోద్దీపమునకు తోడ్పడు ననుటకు సందియ మేమి? రామకృష్ణపరమహంస వ్యక్తిగా భిన్నసంప్రదాయములవారి

God, because of that, its Brotherhood is universal, and knows none as outside its pale. Every man, no matter what he is, is recognised as brother.

*Annie Besant: London Lectures 1907, p. 147.*

సాధనల నలవరచుకొని యుండెను; కాని యాతని యను
చరులు సమిష్టిగ నా మార్గము నవలంబింప లేకపోయిరి.
ఇక నంతకు పూర్వ మట్టిప్రయత్నము తలపెట్టుటకే
యసాధ్యమగు పరిస్థితు లుండెను. కాని దివ్యజ్ఞానసమా
జమునం దేర్పడిన సౌభ్రాత్రవాతావరణము భిన్నమత
స్థులు తమ వివిధ బాహ్యసాధనముల నొకచో జేర్చి
యచట వాని సాహాయ్యముతో ఈశ్వరోపాసన జరపు
కొనఁ గలుగుటకు కారణ మయ్యెను. హిందూతత్త్వ
ముతో ప్రజ్వరిల్లుచుండిన రామకృష్ణుని విస్తృతసాధన
విధానము అందులకు మార్గప్రదర్శకముగ నుండెను.
కేశవచంద్రుడు సయిత మిట్టి సాధనప్రణాళిక నవలంబిం
చెను. హైందవజాతీయజీవనమునం దిముడులాగున ఇత
రుల భావములు, ఆదర్శములు, సాధనములు, ఉత్తమ
జీవితములు స్వీకరింపబడవలసినదే. ఆదినుండియు హిం
దూసంఘమున నట్టి మహోద్యమము జరగుచునే యుం
డెను. మరియు హిందువులం దప్పుడప్పుడు ప్రబలియుం
డిన నికృష్టదైవపూజలు ఖండింపబడి తొలగింపబడుచు
వచ్చెను. మహాసమన్వయాచార్యు డని నేడు హిందువు
లెల్లరిచే కొనియాడబడు శంకరుడు, ఆయనకాలమున

కొందరు మల్లరి యను పేర శివుని శునకముగ జేసి యపవిత్రముగ జరపుచుండిన నికృష్ట పూజను, మరికొందరు కాపాలికు లనువారు భైరవుని దేవునిగ జేసి నరబలులతో గావించుచుండిన భయంకర పూజను నిర్మూలించెను. దోషములను తొలగించుచు సర్వసాధనములను సద్వినియోగమునకు దెచ్చువారలె యథార్థసంస్కర్తలయి సంఘమునకు మహోపకారము గావింతురు. కేశవచంద్రుడు జాతీయభావప్రేరితు డయి తన యుద్యమమును జాతీయరూపముతో నడుప ప్రారంభించినది మొదలు హారతి, హోమము ఉపాసనాంగములుగ జేయుటయె గాక ఆయన తన యనుచరులలో భక్తిని విశాలత జెందించుటకు వివిధమతచిహ్నముల సంయుక్తపరచి వారి దృష్టిపథమున నిలిపెను; జీసను, మోజెను, మహమ్మదు, బుద్ధుడు, గౌరాంగుడు మున్నగు భిన్నమతప్రవక్తల నామములు వారి కనుదినసంస్మరణీయము లని విధించెను. ఉపాసనావిధానమున కలుగుటకు ప్రారంభమయిన యీ యౌదార్యము సర్వమతసఖ్యతకు ప్రబల సహకారియె గదా!

దివ్యజ్ఞానసమాజము అనిబెసెంటుయొక్క నాయకత్వ ముక్రింద మహోచ్చస్థితికి వచ్చి తద్వారమున భారతవర్షముయొక్క యాధిక్యత యావత్ప్రపంచమునకు వెల్లడియయ్యెను; హైందవజాతి విశేషప్రఖ్యాతి గాంచెను.

దివ్యజ్ఞానసమాజమునకు గాని రామకృష్ణసంఘమునకు గాని ఆర్యసమాజమునకు గాని బ్రహ్మసమాజమునకు గాని చెందని యుదారధర్మసాధకులు మరికొందరు కూడ హిందూదేశమున ధర్మవిజృంభణమునకై పాటుపడ మొదలిడిరి. నవ్యభారతజీవనము పెంపొందించి కీర్తిశేషు లయిన మహనీయుల కృషినిగూర్చి యింతదనుక తెలుపబడినది. ప్రస్తుతము మనమధ్య నవ్యభారతప్రబోధకు లై జీవించియున్న మహాపురుషుల సందేశము రాబోవు ప్రకరణమున వ్యక్తీకరింపబడును.

# ప్రకృత ప్రబోధము

నేడు సమన్వయదృష్టి హిందూదేశమున మరల సూక్ష్మతరము గా జొచ్చెను. ఈశ్వరదూరులుగ నాంగ్ల విద్యాధికులను మార్చుచున్న భౌతికవిజ్ఞానమె హిందూదేశమున నూతనరూపము దాల్చుచు ఆధ్యాత్మికవిజ్ఞానముగ పరిణమిల్లు చున్నది. జీవశాస్త్రమం దద్భుతకృషి సలిపి క్రొత్తవిషయముల వెల్లడించి జగద్విఖ్యాతి గాంచిన నవయుగ భారత వైజ్ఞానిక శిఖామణి, జగదీశ చంద్ర బోసు, పాశ్చాత్య ప్రకృతిపరిశోధకుల ధోరణియందు బడక యెట్టి నవీనపథము ద్రొక్కెనో గమనింపుడు. "పాశ్చాత్యదేశములందు విభజనప్రణాళిక యమితముగ ననుసరింపబడుటచే, విజ్ఞానశాస్త్రము లనేకము ప్రత్యేకముగా లేక, వాని నన్నిటిని నిముడ్చుకొని యుండు శాస్త్ర మొక్కటియె కల దను మూలసత్యము మన దృష్టిపథమునుండి తొలగి యరిష్టము వాటిల్లినది. హిందూదేశము దాని కభ్యాస మై యున్న మనోవృత్తిని బట్టి యొక విపులసమన్వయము సాధించుట కెక్కుడు

తగియున్న దని నుడువ వచ్చును. భౌతికవిజ్ఞానమునకు సంబంధించిన కృషియందు సర్వవిషయముల కన్వయించు మహాసూత్రము నిరూపించుట వాస్తవముగ నొక ఘన కార్యము. అది కేవల భావనాజనిత మయినదె గాక యద్భుతముగ దోచు భిన్నత్వమునందు తదాశ్రయ మగు నైకత్వమును ఋజువు చేసి స్పష్టముగ ప్రయోగ ర్యాపమున కన్వయించుటవలన నిర్ధారితము కావలయును. ఈ గొప్ప గౌరవము హిందూదేశము బడయ నున్నదా? జడముతో శక్తి యెట్లు కలసి పనిచేయు చున్నదో యారయుటకు నేను గావించిన పరిశోధనలయందు, వాని రెంటిని వేరుపరచు హద్దులు సమసిపోవుటను కనుగొంటిని, జడజీవముల నడుమనున్న సంబంధము తెలుపు నంశము లను గాంచియు విస్మితుడనైతిని. . . . . . . . . . . . . .

"వృక్షజీవనమునకు జంతుజీవనము భిన్నముగా నున్న దని నిశ్చయించు లెక్కకు మీరియున్న ప్రయోగము లన్నియు పరిశీలించిన పిమ్మట, అవి యెన్నెన్ని భేదములతో గోచరించు చున్నను, జంతువులోను, వృక్షములోను గల జీవ మొక్కటెయని, నేను ఋజువు చేయ గల్గితిని.

అనగా జీవమంతయు నొక్కటియె యని తేలినది.”
అని జగదీశచంద్రబోసు ప్రకటించియున్నాడు. “ఏకం
రూపం బహుధా యః కరోతి”[2] అను నార్య ధర్మసూత్ర

1. The excessive specialisation in the West has led to the danger of our losing sight of the fundemantal truth that there are not sciences but a single science that includes all. India is, perhaps through her habit of mind, better fitted to realise a wider synthesis. One of the greatest contributions in the realm of science would undoubtedly be the establishment of a great generalisation, not merely speculative but based on actual demonstration of an underlying unity amidst bewildering diversity. Shall this great glory be for India to win? In my investigations on the action of forces on matter, I was amazed to find boundary lines vanishing and to discover points of contact emerging between the Living and Non—Living. ...............

It was after repeating every one of the innumerable tests by which animal life is usually differentiated that I was able to prove that the phenomenon of life, with all its multiplex variations, is identical in plant and in animal. In other words all life is One.
*J. C. Bose: Benares Hindu University address. 1916.*

2. కఠోపనిషత్తు V-12.

మున్న. ఆయన ప్రకృతి పరిశోధనలయందు కనఁగొనినట్లు కరత లామలకము. హిందూ దేశమందలి ప్రకృతి శాస్త్రజ్ఞులు, ఆంగ్లవిద్యావంతులు పాశ్చాత్యభావదాస్యమునుండి విడివడి తమ సాంప్రదాయిక ధర్మజీవన మనుసరించి సకలోద్యమము లిక ముందు నడపుకొందు రని దృఢముగ జెప్పవచ్చును. ప్రస్తుతము వారియందు స్వజాతివిముఖత్వము తొలగినది. దేశాభిమానము, స్వమతాభినివేశము వృద్ధినొందు చున్నవి. నేటి హిందూధీశాలుల ప్రబోధ మంతయు నందఱకు తోడ్పడు చున్నది.

## రవీంద్రుడు

ప్రకృతకాలమున రామమోహనని ధర్మసందేశము నుజ్వలరూపమున ప్రకటించు వారిలో విశ్వకవి రవీంద్రుని మొదట పేర్కొనవలయును. బ్రహ్మసమాజ నాయకు డైన దేవేంద్రనాథుని పుత్రు డై బ్రహ్మసమాజముతో చిరకాలసంబంధము గలిగి రవీంద్రుడు రామమోహనసందేశము బాగుగ గ్రహింప గలిగెను. ఆతడే తనునుగూర్చి యిట్లు చెప్పుకొనెను. "రామమో

హానుడు నవయుగమందలి ప్రథమమహాపురుషుడు. ప్రాక్పశ్చిమములకు గల యాధ్యాత్మికైక్యతను తన హృదయమునందు దర్శింప గల గభీరవిశ్వాసమును విశాలదృష్టియు నాతడు కలిగియుండెను. స్వదేశస్థు లాతనిని వాస్తవమునకు విడనాడిరి; కాని నే నాతని ననుసరించుచున్నాను.*[1] ప్రాక్ప్రతీచీ సమ్మేళనమునకై యెంత యవమానము భరించినయైనను, ఎంత త్యాగము చేసినయైనను, పాటుపడుట నవయుగవిధ్యుక్తధర్మ మని యతడు ప్రకటించుచున్నాడు. సాధన, జాతీయత మొదలగు నాతని యుద్గ్రంథములు ఈ యుద్యమనిర్వహణమునకె యుద్దేశింపబడినవి. ఆతని గీతములు, పద్యములు, కథలు, నాటకములు, నవలలు మొదలగు రచనలలో ననేకము ఆ మహాత్కార్యసిద్ధికె వ్రాయబడినవి. ఆతని భావగాంభీర్యమును, అద్భుతకవితాచతురతను, ఉత్తమజీవనాదర్శ

1. Rammohun Roy was the first great man in our age who had the profound faith and large vision to feel in his heart the unity of soul between the East and West. I follow him, though he is practically rejected by my countrymen.

*Rabindranath: Letters to a Friend, page 109.*

మును ముఖ్యముగ 'గీతాంజలి' యను నాతని యుత్కృ
ష్టగ్రంథమునందు గాంచి పాశ్చాత్యు లాతనికి నోబిల్
బహుమానము నిచ్చిరి. ఆతడు కవితాలోకమున నగ్ర
గణ్యుడుగ నుండుటచే, భారతీయు లాతనిని 'విశ్వకవి'
యనుచు సన్మానించు చున్నారు. స్వదేశస్థుల మతసాం
ఘిక రాజకీయోద్యమములం దేమి, పాశ్చాత్యుల ప్రవ
ర్తనములం దేమి, దొరతనమువారి పద్ధతులం దేమి, సర్వ
జనమైత్రికిని, ప్రపంచశాంతికిని, ప్రాక్పశ్చిమ సమ్మేళ
నమునకును విరుద్ధముగ నుండు కార్యములు గాన వచ్చి
నప్పు డెల్ల తీవ్రముగ విమర్శించి తన సందేశము రవీం
ద్రుడు ప్రకటించుచు విశ్వమానవకల్యాణమును వాం
ఛించుచున్నాడు. "యత్ర విశ్వమ్ భవతి ఏక నిదమ్"
అనగా యావత్ప్రపంచవాసులు చేరుటకు యోగ్యముగ
నుండు కులాయము అను నాదర్శముతో 'విశ్వభారతి'
యనబడు మహావిద్యాపరిషత్తును ఆతడు ప్రతిష్ఠించి
ప్రాక్పశ్చిమ దేశవాసులలో జ్ఞానవినిమయము పెంపొంది
సామరస్యము నెలకొనుటకు నవిుతకృషి సలుపుచున్నాడు.
తద్విద్యాసంస్థ పోషణమునకు వివిధదేశములవారు ధన
సాహాయ్యము చేయుచున్నారు. ఐర్లాండు కవిశేఖరుడు

డబ్ల్యు. బి. యీట్సు, దీనబంధు సి. ఎఫ్. ఆండ్రూసు, పియర్సన్ మొదలయిన పాశ్చాత్యప్రముఖులు ఆతని కత్యంతాభిమానులై యాతని మహోద్యమవ్యాప్తికి సహాయభూతులైరి. ప్రాక్పశ్చిమ సమన్వయకార్య మునకు ప్రథమమున పూనుకొన్న బ్రహ్మసమాజము సార్థకత జెందుటకు ఆత డొసంగిన యుపదేశము భార తీయు లెల్లరకు నుపయుక్తముగ నుండును; కాన వారు దాని భావమును గమనింతురు గాక! "ఎచట బాహ్య మున నధికకార్యనిర్వహణ ముండునో యచట నంతర మున బ్రహ్మము పొంద బడనియెడల, ఎవ్విధమునను సమన్వయ మిసుమంతయు గలుగజాల దని యెకప్పుడు తెలిసికొన వలసివచ్చును. ప్రయోజనమునె చూచు బుద్ధికి నెంత పెద్ద పేరు పెట్టినను, స్వార్థపరత్వమును ఎంతటి మహాసింహాసనమున గూర్చుండ బెట్టినను, కేవల నియమమును ఎంత పరిపూర్ణత నొందించినను, భౌతిక శక్తిని ఎంత ప్రబలపరచి ప్రతిష్ఠించినను, వానిలో నెద్దియు సత్యప్రతిష్ఠ గానేరదు. తుదివరకు వానిలో నెద్దియు నిలచుటయు దేని నయిన నిలుపుటయు నసంభ వము. ప్రబల మయ్యు ప్రశాంతమును, వ్యాప్త మయ్యు

గభీరమును, స్వార్థసహితమయ్యు విశ్వహితకరము నగు అధ్యాత్మికజీవనసూత్రముచే బంధింపబడని యెడల ఇక నే కృత్రిమసంబంధపాశముచేతను జ్ఞానముతోడ జ్ఞానమును, కర్మముతోడ కర్మమును, జాతితోడ జాతియు, యథార్థముగ సమ్మిళితము కాజాలవు. తత్సమేళనము సంఘటిల్లనియెడల, ప్రయత్నము విపుల మయినకొలది సంఘాతవేదనము దుస్సహమగు చుండును. ఏ సాధన యెల్లరిని జేర్చి మిళితము చేయ గలదో, ఏ సాధనద్వారమున జీవనము సర్వమును గ్రహించుచు సకలముమధ్యను సమత్వభావముతో వర్తింప గలుగునో, ఆ బ్రహ్మసాధనను సంపూర్ణరూపముతో భారతవర్షము యావత్ప్రపంచమందు ప్రతిష్ఠించుటయె బ్రహ్మసమాజచరితార్థత*[1] బ్రహ్మసమాజమె గాదు, ఏ సమాజమును, ఏ భారతీయోద్యమమును స్వార్థ పూరిత మగు సంకుచితజీవనరూపమున బడక యాధ్యాత్మికదృష్టితోను విశాలహృదయముతోను నవయుగమున సమన్వయసాధన సలుపవలయు నని యా మహనీయుని యాశయము.

1. శాంతినికేతన సంపుటము 18. పుటలు 116, 117.

మానవు డెట్టి యుదారస్వభావుడును ఉత్తమసాధకు డును గావలయు నని రవీంద్రుడు వాంఛించు చున్నాడో యాతని యీ క్రిందివచనములు స్పష్టపరచు చున్నవి.

"ఒక నాడు రామానందు డను బ్రాహ్మణుడు తన శిష్యులను వదలి చండాలు డగు నాభుని, నేతగా డగు కబీరును, వీధుల నూడ్చువా డగు రూదాసును కౌగలించుకొనెను. బ్రాహ్మణసంఘము రామానందుని బహిష్కరించెను. కాని తాను చేసిన పనివలన తానె శ్రేష్ఠ మయిన బ్రాహ్మణుడ నని రామా నందుడు ప్రకటించెను. స్వకులస్థుల నిందలను సరకుగొనక దృఢచిత్తుడై 'సోహం' నేనే భగవంతుడనను మహాసత్యమును రామానందుడు నాడు లోకమునకు జాటెను. ఈ మహాసత్యమె, మానవులందు భేదములు కల్పించు సాంఘిక వ్యవస్థలను, సంఘదృఢత్వమున కవసరము లని తలంపబడు కేవ్టల సంఘీభావ విచ్ఛేదకరము లగు సంకీర్ణభావములను ఆతడు దాటుటకు తోడ్పడెను. ఒకప్పుడు క్రైస్తవమతస్థాపకు డగు జీససు "సోహం" నేనును నా తండ్రి యగు భగవంతుడు నొక్కటే యని వెల్లడించెను. అతని యఖండ

మానవప్రేమ యహంకార మమకారముల నశింప జేసి యాతనిని భగవంతునితో నైక్యము జేసెను. బుద్ధ భగవానుడు సయితము సర్వమానవ సౌభ్రాత్రమును మైత్రిని నెలకొల్పుటకు ప్రచారము సలిపెను. ఆతడు జాతిమత భేదములను వైషమ్యములను ఖండించెను; సర్వకాల సర్వావస్థలయందు సర్వభూతములయందు ప్రేమానురాగములు గలిగి మానవుడు చరించవలయు నని బోధించెను; అదియె బ్రహ్మవిహార మని చెప్పెను.

ఈ యుత్తమసందేశము మానవునకే యొసంగదగినది. ఆతని యంతరమందె "అహం బ్రహ్మాస్మి" నేనే భగవంతుడ నను భావము నెలకొని యున్నది. బుద్ధభగవానుడది తెలిసికొని యనంతప్రేమచేత దాని ననుభూతము చేసికొనవలె నని నుడివెను. అధర్వవేదమునందు "తస్మాత్ వై విద్వాన్ పురుష మిదం బ్రహ్మేతి మన్యతే" అనగా జ్ఞానియైన వాడు మానవుని బ్రహ్మ యని తలంచు నని యున్నది. "ఏ పురుషే బ్రహ్మ విదుస్తే విదుః పరమేష్ఠిం" అనగా ఎవ్వరు మానవునియందు బ్రహ్మమును గ్రహింపగలరో వారు పరబ్రహ్మమును తెలిసికొందురు. మాన

వునియందు బ్రహ్మమును దర్శించినందున బుద్ధ భగవా
నుడు "మాతా యథానియం పుత్తం, ఆయుసా ఏకపుత్త
మనురఖే, ఏవమపి సర్వభూతేసు మానసంభవయే అపరి
మాణం" అనగా ఒక్క పుత్రునే కలిగియున్న తల్లి
వాని నెంత గభీరముగను, అధికముగను ప్రేమించునో
యవ్విధమున నీవు మానవులను ప్రేమింపు మని యుప
దేశించెను. ఈ యాదేశ మనుసరించు వారిని లెక్కించి
యా సంఖ్యనుబట్టి దాని శ్రేష్ఠత్వమును మనము నిశ్చ
యింప జనదు. సత్యముయొక్క శ్రేష్ఠత్వము సంఖ్యాబల
ముపై నాధారపడి యుండదు. భగవంతుడు తన హృద
యమునం దున్నా డని గ్రహించిన వాడు సంఖ్యకై
వేచి యుండడు. అపారప్రేమచే మానవుడు తనయందు
ప్రతిష్ఠిత మై యున్న భగవానుని గ్రహింప వచ్చు నని
బుద్ధభగవానుడు నిస్సందేహముగ లోకమునకుచాటెను.
సంపూర్ణవిశ్వాసముతో ఆత డీ సందేశమును మానవ
కోటికి నొసంగి మానవునియందు తనకు గల గౌరవము
వెల్లడించెను. "విద్వాన్ పురషమిదం బ్రహ్మేతి మన్య
తే" అను నథర్వవేదవచనము ఇదివరకె తెలిపి యుంటిని.
మానవుడు తన పరిమిత జీవనమందు గాక యనంత పర

బ్రహ్మమునం దధివసించును. తనూమ్నలమున నె మానవుని యస్తిత్వమును ఆధిక్యతయు, శక్తియు సిద్ధించుచున్నవి"[1] మానవుల కెట్టి యున్నతజీవనము లక్ష్యముగ రవీంద్రుడు కనపరచు చున్నాడు! మానవు డే జాతివా డైనను బ్రహ్మస్వరూపుడే! పూజనీయుడే!

## రాధాకృష్ణుడు

రవీంద్రుడు నేడు ప్రకటించు చున్న ధర్మసందేశము నకు నాతని గ్రంథము లన్నియు నామూలాగ్రముగ పఠించి తత్త్వనిరూపణము గావించి యది హైందవధర్మ తత్త్వముయొక్క నవయుగవికాసముగ నెట్లు విలసిల్లు చున్నదో పండితరాధాకృష్ణ స్పష్టీకరించి మహోప కారము జేసెను. "రవీంద్రుని ధర్మతత్త్వము" అను గ్రంథము రాధాకృష్ణుడు రచించి యాతని సందేశవ్యాప నమునకు దోడ్పడుటయె గాక "భారతధర్మ తత్త్వము"

1. Rabindranath: Andhra University Lecture III delivered in December, 1933.

అను మహాగ్రంథమును వ్రాసి భారతజాతియొక్క ధర్మ
జీవనవికాసమును అనేకవివరములతో సవిస్తరముగ లోక
మునకు వెల్లడించెను. హిందూదేశాభ్యుదయమునకు,
తద్వారమున సర్వమానవ సఖ్యతకు నాతడు తన తత్త్వ
జ్ఞానమును వినియోగించు చున్నాడు. తత్త్వజ్ఞానము
యొక్క ప్రయోజన మెట్టి దని యాతడు నిరూపించు
చున్నాడో గమనింపుడు.

"సర్వమునకు సంబంధము సమకూర్చు మూలాధార
మగు ధార్మికభావనాశక్తి మనకు కలిగించుట తత్త్వశా
స్త్రముయొక్క ప్రయోజనము. ఆ ధార్మికభావనాశక్తిని
క్రోడీకరణవిజ్ఞాన మని ప్లేటో మహాశయుడును, సమన్వ
యబుద్ధియని హిందూతత్త్వజ్ఞులును పిలచిరి. మరియు
తత్త్వశాస్త్రముయొక్క యుపయోగము ఆత్మీయబాం
ధవ్యమును నెలకొల్పు తత్త్వజ్ఞానమును మనకు ప్రసా
దించుట. తద్వారమున సంశయమానసమువలన సిద్ధించు
శిథిలతనుండి మతముయొక్క మూలోద్దేశములు కాపా
డబడి భిన్నమతావలంబకులలోను తెగలలోను ప్రబలు

విరోధములు సమసి పోవును.[1] ఇట్టి యుదారతత్త్వజ్ఞానమును స్వదేశమందును విదేశములందును రాధాకృష్ణ పండితుడు వెదజల్లుచున్నాడు. మతముయొక్క గభీరతను ఉత్కృష్టతను, ఆవశ్యకతను నవయుగపరిస్థితులకు దగినటుల నాతడీ క్రింద విధమున నిరూపించు చున్నాడు:

“వ్యక్తిని పరిపూర్ణవికాస మొందించుటయె మతము యొక్క యుద్దేశ్యము. కాని యీ యుద్దేశ్యము సంఘస్థులెల్లరు చేపట్టిననె గాని మానవకోటియు, మానవ నాగరికతయు సురక్షితములుగ నుండనేరవు. హిందూ సంఘము తనయందు జ్ఞానవిహీనులగు పలువుర నుండ నిచ్చుటచే కృశించినది. గ్రీకు, రోమను నాగరికతలు

1. It is the function of Philosophy to provide us with a spiritual rallying centre, a synoptic vision, as Plato loved to call it, a Samanvaya, as Hindu thinkers put it, a philosophy which will serve as a spiritual concordant, which will free the spirit of religion from the disintegrations of doubt and make the warfare of creeds and sects a thing of the past.
*S. Radhakrishnan: An Idealist View of Life, p. 83*

పామరజన సమూహములచే నావరింపబడి యుండుట వలన నశించినవి. ధర్మజీవనము గలవాడు పరమునందే గాక యిహమునందును ఈశ్వరోపలబ్ధి గాంచవలయును. ప్రతివ్యక్తి తన జీవితమును ధర్మప్రేరితము చేసికొన వలెను; ధర్మరాజ్యమున వసించుటకు దగిన సభ్యుడుగ మారవలెను. ఈశ్వరరాజ్యముగ పరిణమిల్లుటే మానవ కోటియొక్క పరమావధి యైనయెడల, సోదరమానవుని వధింపు డని గాని బలవంతుల లాభమునకై బలహీనుల నణగ ద్రొక్కు డని గాని మానవుల ప్రేరేపించు సమ రసిద్ధాంతమునకు తా వుండ నేరదు. "ప్రపంచ మంతయు నొక కుటుంబము" అనునది ధర్మజ్ఞులు పాటించు నీతి. "మానవునికంటె శ్రేష్ఠతర మయినది మరియొకటి లేదు. ఈ మహారహస్యమును నేను నీకు తెలుపుచున్నాను." అని మహాభారతము చెప్పుచున్నది. "గుహ్యం బ్రహ్మ తదిదం వో బ్రవీమి న మానుషాత్ శ్రేష్ఠతరం హి కించిత్" (XII 300-20) జన్మభేదము గాని, జాతిభేదము గాని పాటింపక సర్వమానవులు సోదరులవలె మెలగుట యే పరమాదర్శము. ఆగంతుక సంఘటనలను బట్టియు పరిస్థితులను బట్టియు మానవకోటి లెక్కలేనన్ని జాతు

లుగ చీలినది. వానిలో నొక్కొక్కదానికి ఒక్కొక్క భాషయు, ఒక్కొక్క వ్యక్తిత్వమును, ఒక్కొక్క శారీరకస్వరూపలక్షణములును గలవు. ఇదంతయు నెట్లు జరిగెనో చరిత్ర తెలుపును. ఒక్కజాతిని తప్ప తక్కిన జాతుల నన్నిటిని సంహారము జేసి యీశ్వరసృష్టిని మనము చక్కపరుప నక్కరలేదు. వివిధజాతులలో విద్వేషబీజముల నాటి సోదరతుల్యు లగు ఆజాతులకు జెందినవారు దారుణయుద్ధములో నొకరి నొకరు వధించుకొనుటకు పురిగొల్పునట్టి కలహములును కలతలును ధర్మాభావము వలన జనించును. మానవజాతి యంతయు నొక్కటి యను విశ్వాసము గలిగి యుచ్చస్థితిలో నున్నవారు హీనస్థితిలో నున్న యేజాతియొక్క భాధలనైన గాంచి యూరకుండజాలరు. ఎక్కడ గాన్పించినను, నిరంకుశత్వమును అన్యాయమును నిర్మూలించుటకు మనము పోరు సలుపవలెను. "వ్యభిచారము" అను మాట యీ పేరుతో జరుపబడు నీచవ్యాపారమునకే యుపయోగింప నక్కరలేదు. స్వలాభమునకై నిర్బంధపూర్వకముగ ఒక వ్యక్తి మరొక వ్యక్తిని గాని ఒక తెగవారు ఇంకొక తెగవారిని గాని ఒక జాతివారు తదితర జాతివారిని గాని

లోబరుచుకొను యత్నము లన్నియు నా పేరుతో పిలువ
బడవచ్చును. న్యాయముకొరకు నాగరికతను వినాశ
మొందింప గూడ దని వాదించు వారలు గలరు. వారు
చెప్పునది, సత్యముకొరకు సౌఖ్యమును, దైవముకొరకు
ధనమును, త్యజింప గూడ దనియె. అన్యాయము నాధా
రము జేసికొన్న నాగరికత చిరకాలము నిలువ నేరదు.
సంఘసంస్కరణమును, సర్వజాతుల శ్రేయమును ముఖ్యో
ద్దేశ్యములుగ పెట్టుకొనని మతము నవీనజ్ఞానమునకు
తృప్తి గొలుపదు. మత మనగా నొకవ్యక్తి ప్రత్యేకముగ
పొందెడు నేదోయొక యాధ్యాత్మికావస్థ గాదు. ఈశ్వర
శాసనమును మానవులమధ్య పాలించుటయె మతము.
ఈశ్వరవిశ్వాసి తనవలె తోడిజనులను ప్రేమించును; స్వా
ర్థము త్యజించి భక్తిపూర్వకమగు సేవను సలిపి తన
కెంతమేలు కోరునో యంతమేలు పరులకు జేయును.
నాగరికతకంటె న్యాయమును, దేశాభిమానముకంటె
సత్యానురక్తిని అతడు శ్రేష్ఠములుగ పరిగణించును.
"స్వాతంత్ర్యము కొరకు గాక సత్యముకొరకు హిందూదే
శమునే బలిగానిచ్చుటకు నే నిచ్చగింతును.'* అని గాంధి
మహాత్ముడు నుడివిన మాటలు గమనింపుడు. చారిత్రిక

ఘటనలవలన గాని స్వభావసిద్ధముగ గాని భూమి మీద నేర్పడిన పరిహద్దులను గాక న్యాయాన్యాయములకును, స్వేచ్ఛాస్వేచ్ఛలకును, సత్యాసత్యములకును నడుమనుండు పరిహద్దులను మాత్రమె గమనించు దేశాభిమానము గల సుదృఢధర్మాత్ముల మూలమున విశ్వమానవైక్యత స్థాపిత మగును. మానవైక్యతను గాంచగలిగి నూతననాయకత్వము వహించు ధీరపురుషులు నేడు ప్రపంచమున కత్యంతావశ్యకము. ధర్మదృష్టితో రాజ్యాంగములు నడపువారు, వ్యాపారములు సేయువారు, ఎంతకష్టపడినను, ఎంతగా నధికారుల యాగ్రహమునకు లోనగుచున్నను, ధర్మమును త్యజింపని ధీశాలులు ఇప్పుడవసర మయినంతగా చరిత్రలో పూర్వ మెన్నడు నవసరమై యుండలేదు. ఈ యుగమున ముఖ్యముగ కావలసినది యెక్కుడు విస్పష్టమును ఎక్కుడు గభీరము నగు నేకవిశ్వేశ్వరుని సాక్షాత్కారమె."[1]

1. S. Radhakrishnan: The religion we need. pages 30, 31, 32.

## అరవిందుడు

దివ్యదృష్టిని వికసింప జేయుటకును, ఐహికజీవనమును ఆధ్యాత్మికజీవనముగ పరివర్తనము నొందించుటకును, మతవిద్వేషముల నణచి మతసామరస్యము నెలకొల్పుటకును, జీవాత్మయందు స్వార్థము నిర్మూలించి విశ్వాత్మను ఆవిర్భవింప జేయుటకును ధర్మోపదేశముల గావించుటయె గాక అరవిందయోగి యోగాభ్యాసమును ఆత్మశిక్షణమును తోడిజనులలో వ్యాపింప జేయుచున్నాడు. ఆతడు స్వదేశాభ్యుదయమును, లోకకల్యాణమును అమితముగ కాంక్షించుచున్నాడు. తనయుత్తమ ధార్మికాశయములను 'ఆర్య' అను పత్రికమూలమునను ఇతరప్రచురములవలనను వెల్లడించి యున్నాడు. ఆతడు గొప్ప జ్ఞానియె గాక మహాయోగసాధకుడు. ఆతనికి ప్రస్తుతము పలువురు శిష్యులు గలరు. ఉద్యోగస్థులు, ధనికులు తమ ధనము ఆతడు నిర్ణయించు నియమానుసారము వెచ్చించుటకును, తమ కాలమును ఆతడు విధించు పద్ధతిని గడపుకొనుటకును, తమ యాధ్యాత్మికసాధనలందు ఆతడు గరపు విధానముల ననుసరించుటకును

దీక్ష బూని యున్నారు. ఆతని దర్శనభాగ్యమునకై నిరీక్షించు భక్తు లెందరో దేశమున బయలుదేరిరి. అరవిందుని జ్ఞానామృతమును యోగశిక్షణమును ప్రకృత భారతపరిణామమున కెంతయు సాయపడు చున్నవి. "నీ జీవనమును పరివర్తన మొందింపుము; ఆత్మీయపునర్జన్మము దాల్పుము; అంతరాత్మ నీకు విధించు కార్యమును ఆ నూతనజీవముతో నిర్వహింపుము. భగవద్గీతాసందేశ మిది"[1] యని వ్యక్తీకరించుటలో అరవిందుడు తనజీవితోద్దేశమును వెల్లడించు చున్నాడు. ఆధ్యాత్మిక ద్విజత్వమునకయి ప్రతివ్యక్తి పొందవలసిన చిత్త సంస్కారమే యాతడు నిర్దేశించు యోగసాధనల లక్ష్యము. ఎట్టి చిత్తపరివర్తనము కలిగింప నాతడు ప్రయత్నించు చున్నాడో యీ దిగువ నుదాహరించిన యాతని భావములవలన గ్రహింప నగును.

1. Change your being, be reborn into the spirit and by that new birth proceed with the action to which the spirit within has appointed you, may be said to be the heart of its message.

*Aurobindo: Essays on the Gita, 1st series, p. 368.*

"ఈశ్వరకార్యములను నిర్వహింపవలె నని నీకు యథార్థమయిన యాకాంక్ష యున్న యెడల అహంకారమమకారములను పూర్తిగ విడుచుట ప్రథమకర్తవ్యము. నీ యావజ్జీవితము పరమేశ్వరునకు కానుకగా, బలిదానముగా నర్పింప వలయును. నీవు కార్యములు చేయునప్పుడు, ఈశ్వరకార్యములనే చేపట్టి ఈశ్వరుని యుపకరణమయి ఆతనినుండి శక్తిని పొందుచు వినియోగించుచు సఫలీకృతము చేయుట నీ యుద్దేశమై యుండవలెను. నీ యిచ్ఛకును ఈశ్వరేచ్ఛకును భేదము లేనంతగా, నీలో ఈశ్వరప్రేరణ తప్ప మరొక కోరిక లేనంతగా, ఈశ్వరుడు నీలో నీద్వారమున తానె సంకల్పించి చేయు కార్యముతప్ప నీ కింకే కార్యము లేనంతగా, నీవు పరివర్తనము జెంద వలెను.

ఇట్టి తీవ్రమును సంపూర్ణము నగు నభేదభావము పొందుటకు నీవు శక్తివంతుడ వగువరకు, నీ వా పరమజననిని సేవించుటకు శరీరాత్మలతో సృజింపబడిన యామె బిడ్డవును ఆమెకొరకే సమస్తకార్యములు జేయువాడవు నై యున్నా వని తలంప వలెను. 'ప్రత్యేకముగ పాటు

పడు చున్నా' నను భావము నీలో దృఢముగ నుండి కార్యనిర్వాహకుడవు నీవే యని తలంచుపక్షమున సర్వ కార్యములు నీ వామెకొరకే చేయ వలెను. అహంకార పూరిత మగు వాంఛోద్రేక మంతయు, స్వలాభాన్వేషణ మంతయు, స్వార్థచింత చేయు నిర్ణయమంతయు నీయందు నీవు నిర్మూలింపవలెను. ఫలాపేక్షయు, స్వలాభాన్వేషణము నెంత మాత్రమును తగవు. జగన్మాతయొక్క ప్రీతియు కార్యసాఫల్యమును - ఇవే నీవు పొందవలసిన ఫలములు; ఆమెయొక్క జ్ఞానమందు, శాంతియందు, శక్తియందు, ఆనందమందు నిరంతరాభివృద్ధి నొందుటయె నీవు బడయవలసిన లాభము. సేవ జేయుటమూలమునను, తద్ద్వారమున ఆత్మోన్నతి బడయుటవలనను, లభించెడు ఆనందము స్వార్థశూన్యు డగు సేవకునకు నర్హమగు ప్రతిఫలము.

కాని యిట్లు పాటుపడు చుండ, నీవు కర్తవు గాక కేవల ముపకరణమె యని యధికతరముగ గుర్తించు సమయము కూడ వచ్చును. ప్రథమమున నీ సాధనబలమువలన జగన్మాతతోడి నీ సంబంధ మత్యంత సన్ని

హిత మగును. నీ మనస్సు నిశ్చలము చేసికొని నీ సర్వము ఆమె హస్తములం దర్పింతువు; నిన్ను పరిష్కృతము నడుపుటకు, నిన్ను ప్రత్యక్షముగ నాజ్ఞాపించుటకు లేక ప్రోత్సహించుటకు, నీ కర్తవ్యమును తన్నిర్వహణవిధానమును తత్ఫలమును నీకు స్పష్టముగ జూపుటకు ఆమెను కోరుదువు. అనంతరము ఆమెశక్తి నిన్నుత్సాహపరచి నడపుటయె గాక యామెయె నీ కార్యముల నుపక్రమించి నిర్వహించు చున్న దని గ్రహింతువు. నీ కార్యము లన్నియు నామె ప్రారంభించును. నీశక్తు లన్నియు ఆమెనుండి యుద్భవిల్లును. మనస్సు, ప్రాణము, శరీరము ఆమె హస్తమందలి యుపకరణము లై బాహ్యజగత్తునందు ఆమె ప్రకాశించుటకు ద్వారము లై యట్టి జ్ఞానముతో నానందభరితము లగును. ఈ యైక్యత కన్న, అధీనతకన్న నానందకర మయిన పదవి మరెద్దియు లేదు. ఏలయన ఈ పరివర్తనమువలన నీవు అజ్ఞానవశమున తాపత్రయములందు బడి గడపు జీవితమును దాటి నీ యాధ్యాత్మిక జీవితముయొక్క యాథార్థ్యమును గ్రహించి దాని గభీర ప్రశాంతిని మహదానందమును అనుభవింతువు.

ఈ పరివర్తనము జరుగునప్పుడు నీ వహంకారవికారములచే నేమాత్రము కలుషితుడవుగా నుండుట యత్యంతావశ్యకము. ఏ కోరికయు, ఏ పట్టుదలయు నీలో ప్రవేశించి బ్రహ్మార్పిత మగు నీ త్యాగజీవితమును మలినపరుప నీయకుము. నీవు కార్యమునందు గాని ఫలమునందుగాని యనురక్తి నుంచ కూడదు; ఎట్టి షరతులు నిర్ణయింప కూడదు; నిన్ను వశపరచుకొన వలసిన జగచ్ఛక్తిని నీవు వశపరచుకొనుటకు వాంఛింపకూడదు; ఎట్టి దంభము గాని, యహంభావము గాని వహింప కూడదు. నీ మనస్సునందు, ప్రాణమునందు, శరీరమునందు నెద్దియు తన యుపయోగమునకై గాని, తన ప్రత్యేకసౌఖ్యమునకై గాని నీద్వారమున పనిచేయుచున్న శక్తుల మహాత్మ్యమును వికృతపరచుటయో, సంగ్రహించుటయో జరుగ నీయ కూడదు. నీ దృఢ విశ్వాసము, నీ సద్భావము, నీ పవిత్రాశయము అమోఘము లయి నీ జీవితముయొక్క యన్ని కోశములందును అన్ని భాగములందును పరివ్యాప్తము గా నిమ్ము. అప్పుడు నిన్ను చలింప జేయు ప్రతివిషయము, వికృతపరచు ప్రతిప్రలోభనము క్రమముగా నీకు దూరములై పోవును.

తుదకు ఈ పరివర్తనముయొక్క చరమావస్థ సంప్రాప్త మగును. నీవు పూర్తిగ జగన్మాతతో నైక్య మగుదువు. నీ విక ప్రత్యేకవ్యక్తివి గాని యుపకరణము గాని సేవకుడవు గాని కర్తవుగాని కాక ఆమె నిజమయిన బిడ్డవును శాశ్వతముగ ఆమె శక్తియందును జ్ఞానమందు నంతర్భూత మైన యంశమును అయి యున్నా వని గ్రహింతువు. సర్వదా ఆమె నీలోను, నీ వామెలో నుందురు. నీవు యోచించుటకు, దర్శించుటకు, పాటుపడుటకు, ఊపిరి పీల్చుటకు లేక కదలుటకు కూడ, వలసిన శక్తి యామెనుండి వచ్చుచున్నది యనియు, ఆ శక్తి ఆమెదే యనియు నీకు సదా సులభముగను సహజముగను అనుభూతమగు చుండును. నీవు ఆమె తననుండి నిర్మాణము చేసిన యొక వ్యక్తి వని, శక్తిస్వరూపుడ వని, నిన్ను క్రీడార్థము తనకు వెలుపల నుంచినను తన జీవములో జీవ మై, తన జ్ఞానములో జ్ఞాన మై, తన శక్తిలో శక్తి యై, తన యానందములో ఆనంద మై వెలయునట్లు తనయం దెల్లప్పుడు సురక్షితముగా నుంచు నని నీవు తెలిసికొందువు, దర్శింతువు, తదనుభవము బడయుదువు. ఇట్టి స్థితి పరిపక్వ మై యామె విజ్ఞానశక్తులు

నిన్ను నిరాటంకముగా కదల్ప గలిగి నప్పుడు, ఆమె కార్యములచే నీవు పూర్ణముగ శోభిల్లెదవు; నీవు జ్ఞానవంతుడవు, సంకల్పసిద్ధుడవు, క్రియాశీలుడవు అనివార్యముగను, సులభముగను, మహోన్నతముగను, స్వాభావికముగను, దోషరహితముగను నగుదువు. జగన్మాత నుండి వెలువడు జీవనధారవలె, కార్యపరంపరవలె వెలుగొందుదువు." [1]

### గాంధిమహాత్ముడు

కర్మక్షేత్రమందు ధర్మయుక్తము లగు కార్యములు సలుపుచు నాదర్శజీవనము గడపు వాడె తోడిమానవులకు మార్గదర్శకుడు కా గలడు. గాంధి మహాత్ముడు ఇక్కాలమునకు వలసిన యాదర్శపురుషుడు ఆతడు నవయుగజనులకు ధర్మోత్సాహము కలిగించి ప్రాక్ప్రతీచీ సమ్మేళనము గావించు మార్గము కనపరచు చున్నాడు. ధర్మము నవవికాసముతో తనయందు మూర్తీభవింప

1. Aurobindo: The Mother V.

జేయుచు తనదృష్టాంతము ద్వారా నితరులను నవజీవన ప్రవిష్టుల జేయుచున్నాడు. వారుశత్రుభావమును మనస్సులనుండి పెకలించి వేయవలె ననియు, సంపూర్ణ త్యాగము చేయుట మూలముననె ధర్మమును తమయందును పరుల యందును పెంపొందింప వలె ననియు, త్యాగజీవనము వృద్ధి నొందిన కొలది సర్వమానవులయందు మిత్రభావము వర్థిల్ల గల దనియు, ఆతడు నోటిమాటలతో బోధించుటయె గాక యుత్తమసాధకు డై యా ధర్మముల కనుగుణముగ తాను జీవించుచు దృష్టాంతపూర్వకముగ ధర్మోత్సాహము రగుల్కొల్పు చున్నాడు. ఆతడు రాజకీయరంగమున పోరు సలిపినను, అస్పృశ్యతా నివారణముకై పాటుపడినను, ఇంక నే యుద్యమమందు కృషి సలిపినను, ఆతడు ధర్మముననె పాలించు చున్నాడు. కావుననె ప్రభుత్వమువారికిని ప్రజలకును, ధనికులకును దరిద్రులను, పురుషులకును స్త్రీలకును, పెద్దలకును పిన్నలకును, సర్వజాతులవారికిని సర్వదేశములవారికిని, సన్మానపాత్రు డయ్యెను. "జీవితమునకు సంబంధించిన సమస్యలందు జోక్యము కలిగించుకొనక వానిని పరిష్కరించుటకు సాయపడని మతమును మత మని పిలు

చుటయె తగదు. అందువలననె ధర్మవిషయములను నేను కార్యరూపమున ప్రత్యక్షము చేయుచున్నాను." 1 అని గాంధిమహాత్ముడు తన దృఢవిశ్వాసము స్పష్టముగ వెల్లడించెను. ఆ మాటలనుబట్టి యాతడు గొప్ప కార్యశూరుడని తేలుచున్నది.

ధర్మము మానవుడు ప్రపంచములోని కేతెంచిన దాదిగ నాతనితోడనె వచ్చినది. అది యెవరికో యొకప్పుడు ఈశ్వరునిచే ప్రసాదింపబడె ననియు, తక్కినవారు దాని నా మహనీయులనుండి స్వీకరింపవలె ననియు చెప్ప జనదు. సర్వకాలములం దది ప్రతిమానవహృదయమున నిమిడియె యున్నది. అందువలన హిందూధర్మవేత్త లది సనాతన మని వచించిరి. అట్టి హృదయస్థమగు ధర్మమును జీవితమున విస్తరింప జేయుటకే వారి

1. Religion which takes no account of practical affairs and does not help to solve them, is no religion. And that is why I am putting a religious matter before you in a practical form.

*Mahatma Gandhi: Young India 7—5—25.*

సాధన; వారి ప్రబోధము. లేనిది సృజించుట గాక యున్నదాని వ్యక్తపరచుట, వ్యాప్తము జేయుట ధర్మవిష యమున జరుగవలసిన కృషి యని హిందూసాధకుల విశ్వాసము. ఈ మహద్విషయము నితరులె గాక హిం దువులును తరచు విస్మరింతురు. నేడది గాంధి మహాత్ము డెట్లు ప్రకటించుచున్నాడో సూచించుటకు ఆయనవా క్యములు గొన్ని యిచట పొందుపరుపబడినవి. అందలి జీవశక్తి గ్రహింపుడు.

"నా విశ్వాసప్రకారము, సనాతనధర్మము వేదముల మీదను వానియనంతరము వెలువడిన సకలేతరశాస్త్ర ములమీదను నాధారపడినట్టియు, అతిపురాతనకాలము నుండి వచ్చుచున్నట్టియు మహాధర్మము. ఈశ్వరునివలె, ధర్మమువలె, వేదములు కూడ ననిర్వచనీయము లని నా విశ్వాసము. ప్రస్తుత మచ్చుపడి యున్న నాలుగు గ్రంథములె వేదము లని చెప్పుట సంపూర్ణసత్యము కాదు. పూర్వమహర్షులు చేసిన బోధనలలో గొన్ని పోగా మిగిలినవి మాత్రమె యీ నాలుగు పుస్తకము లందు కూర్చబడెను. తరువాత వచ్చిన తరములవారు

తమ యాత్మానుభవములు మరికొన్ని యా మూలసిద్ధు లకు జేర్చిరి. పిమ్మట మహానుభావు డగు భగవద్గీతా కారు డుపన్యసిల్లెను నిగూఢవేదాంతభావములు ప్రతిపా దించునదే యయినను, సత్యాన్వేషణపరు డైన ప్రతిస రళహృదయమునకు సులభముగ గ్రాహ్య మగు హిం దూసమన్వయగ్రంథము ఆతడు హిందువులకు ప్రసాదిం చెను. ఈ గ్రంథమొక్కటియె విద్యనేర్చిన సర్వహిం దువుల కందుబాటులో నున్నది. ఇతరధర్మగ్రంథము లన్నియు వినాశ మైపోయినను, హిందూధర్మ మన నేమో, దాని యాచరణవిధాన మేదో స్పష్టీకరించుటకు నీ యుద్గ్రంథములోని యేడు వందల శ్లోకములు చాలును. నేను నలువది సంవత్సరములనుండి భగవద్గీతా బోధనల ననుసరించి జీవించుటకు ప్రయత్నించుచుంటిని. కావున నేను సనాతనధర్మావలంబకుడ నని చెప్పుదును. సనాతనధర్మముయొక్క మూలసత్యములకు వ్యతిరేక మయినదెల్ల హిందూధర్మమునకు వ్యతిరేకమె యని త్రోసిపుచ్చెదను.

భగవద్గీత నెట్టి శ్రద్ధాభక్తులతో పఠించితినో, అట్టి శ్రద్ధాభక్తులతోనె బైబులును, ఖురానును, జెండవెస్తాను ఇతరమతగ్రంథములను నేను చదివితి నని చెప్పుటకు నా కమితానందము. భక్తిపూర్వక మగు తద్గ్రంథపఠనమువలన భగవద్గీతయందలి నా విశ్వాస మతిశయిల్లినది. తన్మూలమున నా దృక్పథమును నా హిందూధర్మమును విశాలత జెందినవి. జీసను, మహమ్మదు, జొరాష్టరు మున్నగు మహాపురుషుల జీవితములు భగవద్గీతలోని యనేకముఖ్యభాగముల నుజ్వలపరచి నాకు చక్కగ బోధపరచినవి. కాన సనాతనధర్మావలంబకుల మని తలంచు నా స్నేహితులు ఏది నాలో దోష మని చూపుచున్నారో నా కదియె యాత్మోపశాంతిదాయకము. నేను హిందువుడ నని చెప్పుకొనుటకు గర్వించుచున్నాను. నా విశ్వాసప్రకారము హిందూధర్మ మతివిశాల మయినది. కేవలపరమతసహనమే గాక, ఈ మహాప్రపంచమున సర్వదేశములలో జన్మించిన మహాపురుషుల సందేశము లన్నిటిని స్వీకరించి తనయం దిము

ద్పుకొనుట కూడ దాసిలక్షణము. అస్పృశ్యత పాటిం
చుట యావశ్యక మని నాకు భగవద్గీతలో నెచ్చట
గాన రాదు. మీదు మిక్కిలి యావత్ప్రాణికోటిలోను
వ్యాపించి యున్న యాత్మ యొక్కటియె యనియు,
పరమేశ్వరునినుండి యుద్భవిల్లు ప్రాణు లన్నియు ఆయ
నసె తిరిగి చేరు ననియు, ఆ మహాగ్రంథము సహేతు
కముగ హృదయరంజక మగు భాషలో నా మనస్సు
నకు నచ్చునట్లు బోధించి నాకు దృఢవిశ్వాసము కలిగిం
చుచున్నది. భగవద్గీతారచయిత బోధించెడు సనాతన
ధర్మప్రకారము, ధర్మజీవన మనగా బాహ్యాచారము
లును కర్మకాండయు గానేరవు; అంతఃకరణ మెంతయు
పరిశుద్ధము గావించి ఆత్మను మనస్సును శరీరమును భగ
వంతునియం దైక్యము జేయుటయె ధర్మజీవనము. ఈ
గీతాసందేశమును నా జీవితమం దావిర్భవింప జేసికొని
కోట్లకొలది జనులను సమీపించి యుపన్యసించితిని. వారు
నా యుపన్యాసముల శ్రద్ధతో నాలకించిరి. వా రట్టి
శ్రద్ధ చూపుటకు కారణము నా రాజకీయపరిజ్ఞానము

గాదు; నా వక్తృత్వసామర్థ్యమును గాదు. నేను తమ వాడ ననియు నేను కూడ తమ ధర్మావలంబకుడనె యనియు నన్ను చూచినంతనె గుర్తించుటవలన, వారట్టి శ్రద్ధ నాయెడ జూపిరి. సనాతనధర్మావలంబకుడ నని చెప్పుకొనుట యసమంజసము గా దను నా విశ్వాసము, రోజులు గడచినకొలది, మరింత దృఢపడు చున్నది. ఈశ్వరేచ్ఛ యట్లున్నచో, నేను ప్రాణము లర్పించి నా నమ్మకమును ఋజువుపరచుట కూడ సంభవించును"[1]

నవ్యభారతభాను డుదయించెను. నవయుగవాతావరణమందలి మబ్బులను మంచును భేదించుకొని తద్విజ్ఞానకిరణములు నలుగడల ప్రసరించు చున్నవి. రామమోహానునియందలి ప్రభాతకాంతి అంతకంతకు స్వచ్ఛతరమును తీక్ష్ణతరము నగుచు రామకృష్ణుని యందు నెక్కుడు దీప్తివంత మయ్యెను. మరియు ప్రస్తుతకాలమున మరింత తేజోవంత మగు చున్నది. రవీంద్రుని

1. Mahatma Gandhi: My Soul's Agony p. 6, 7.

భావనాశక్తిలోను, రాధాకృష్ణుని తత్త్వజ్ఞానములోను, అరవిందుని యోగసాధనలోను, గాంధి మహాత్ముని యాదర్శజీవనములోను నవ్యభారతభానుని నవీనకాంతులు ప్రస్ఫుట మగు చున్నవి. ఈ నల్వురు మహానీయులు ప్రదర్శించు నూతనసమన్వయాదర్శముయొక్క స్వరూపము రాబోవు ప్రకరణమున వ్యక్తపరుపబడును.

సత్యమే దైవము

మతము వ్యక్తిగతము

వ్యక్తి సాంఘికజీవి

అహింస పరమసాధనము

స్వధర్మము సర్వోత్తమము

దరిద్రనారాయణోపాసనము

మాతృదేవీ సంసేవనము

ప్రాక్ప్రతీచీ సమ్మేళనము

భగవంతుని గురించి ప్రతియుగమునందును ప్రతిదేశమునందు నేదో యొక యభిప్రాయము ప్రబలుచు నా కాలమందు నా దేశస్థుల జీవితముల నడవుటలో నగ్ర స్థానము వహించును. ఈశ్వరునిగూర్చిన యభిప్రాయము కాలక్రమమున పరివర్తనము జెందు చున్నను, ఏ కాలపు అభిప్రాయము అకాలపు జనులకు మార్గప్రదర్శకముగ నుండును. ఈశ్వర ప్రేరితు లయి మానవు లెట్టి యద్భుతత్యాగము చేసి యుండలేదు? అమూల్యము లయిన సమస్త ప్రాపంచిక విషయములు ఈశ్వరుని పేరిట త్యజింపబడును. భూరిదానముల చేయువారు, ఆహారపానీయముల విడుచువారు, కఠోరసాధనల సలుపువారు, ప్రాణముల సయితము గోల్పోవువారు ఈశ్వర భక్తులలో పలువుర గాంచ నగును. పరమేశ్వర విశ్వాసము మానవకోటిని సదా పరిపాలించు మహాశక్తియై యున్నది. అయినను ధర్మపరాయణులు కొందరు దేవుని పే రయినను తలపెట్టరు; మరికొందరు నిరీశ్వరవాదుల

మని కూడ చెప్పు కొందురు. ఈశ్వర విశ్వాసుల వలె వారు ఉత్తమ ధార్మిక జీవనము గడపువారె; సత్యము నన్వేషించుచు సత్యముకొరకు తమ సర్వశక్తులు ధారపోయు వారె. కాని వారు ఈశ్వరవిముఖు లగుటకు కారణ మేమి? కొంచెము విచారించినయెడల, వారు నిజమయిన భగవద్భక్తులె యని స్పష్టపడును. భగవంతు డెట్టివాడో పూర్ణముగ తెలిసికొనుట యెంతటి జ్ఞానవంతున కైనను దుర్లభము. కాని ప్రతిమానవుడు ఏదో విధముగ కొంత యీశ్వరుని గురించి తెలిసికొనుటకు శక్తివంతుడె. ఈశ్వరు డనంతతుడును మానవుడు పరిమితుడు నై యుండుటచే, భిన్నమానవులకు ఈశ్వరుడు వారిశక్తికి తగినటుల భిన్నరూపముల గోచర మగును. భగవంతుని గురించి యొక విధ మయిన భావము కలిగిన వా రట్టి భావము లేని వారిని ఈశ్వర దూరు లని నిరసన చేయుట తటస్థించును. ఇందువలననె భిన్నమతముల వారు పరస్పర ద్వేషములకును వైరములకును లోనవుచున్నారు. ఇతర మతస్థులను మహమ్మదీయులు కాఫర్లనియు, క్రైస్తవులు హీధన్లనియు, హిందువులు మ్లేచ్ఛులనియు తమ మతముల మూలోద్దేశముల మరచి

సామాన్యముగ హీనముగ జూతురు. మహమ్మదీయుల లో సున్నీలు, షియ్యాలు మొదలగు తెగల వారును, క్రైస్తవులలో రోమన్ కాతలిక్కులు ప్రొటెస్టెంటులు మున్నగు శాఖల వారును, హిందువులలో వైష్ణవులు శైవులు ఆదిగాగల మతముల వారును గలరు. ఈ భిన్న తరగతుల నడుమ కూడ కలహములు తటస్థించును. ఈశ్వరుని పేరిట ఘోరయుద్ధములు జరిగెను. మతభేదము లనివార్యము లయినను, ఆ విషయమును గమనింపక మూర్ఖముగ పోరాడు వారు సర్వకాలములందు గలరు. మతవిద్వేషము లణగు టెట్లు?

## సత్యమే దైవము

ఈశ్వరు డొక్కడు; సత్యస్వరూపుడు. సత్యము చిర నూతన మగుటచే ఈశ్వరు డెల్లప్పుడు నవ్యతర రూపము లతో శోభిల్లును. నిజమయిన యీశ్వర విశ్వాసులు సదా సత్యాన్వేషణపరు లయి యీశ్వరుని గురించి యధికతరముగ గ్రహింపవలె నని యాతురపడుదురు. కాని, యందులకు విరుద్ధముగ ఈశ్వరవిశ్వాసు లనేకు

లేదో యొక యభిప్రాయమున తగుల్కొని దానికి మించి యెట్టి యాలోచనయు చేయక సంకుచిత స్వభావులును మూఢాత్ములు నగుచు వైరములు పెంచుదురు. ఇటు వంటి వైపరీత్యముల గాంచి కొందరు ధర్మవర్తనులు, సత్యనిరతు లయ్యు, ఈశ్వరవిశ్వాసుల మని చెప్పుకొన నిచ్చగింప కున్నారు. ఏ యొక స్థలమునందో, ఏ యొక రూపమునందో యీశ్వరు డున్నా డనియు, ఇం కెచ్చ టను లే డనియు చెప్పుట యెట్టిమాహాత్మ్యమో, ఒక్క యభి ప్రాయమునందె, ఒక్క నిర్వచనమునందె యీశ్వరుని నిము డ్చుటయు ఇంకొక భావమునకు తావు లేకుండ జేయు టయు నట్టి మాహాత్మ్యమె. ఒక ప్రత్యేక నిర్వచనముతో నిరూపింపబడు వాడె యీశ్వరు డని సామాన్యముగ వ్యవహరింపబడు నప్పుడు, ఆ భావము లేనివారు నిరీశ్వర వాదుల మని చెప్పుకొనిన నేమి వింత? నిరీశ్వరవాదు లం దరు సాధారణముగ నిట్టి వార లై యుందురు. ఈ నవయుగమునందు ప్రకృతిపరిశోధనలతో పాటు ఆధ్యా త్మిక విషయములును పరిశోధింపబడు చున్నవి. ఏదియు సంపూర్ణసత్య మని యంగీకరింపని బుద్ధి నేడు విద్యార్థి కులలో విశేషముగ వ్యాపించినది. వారికి సత్యమం

దాదరణము అమితము; సత్యాన్వేషణమునకు కుతూహ
లము మెండు. కాని వారు సామాన్యముగ రూఢవిశ్వా
సములతోను ఆచారములతోను బద్ధము లయి యున్న
మతములయెడ నుదాసీను లగు చున్నారు. వారిని మత
శూన్యు లనియు అవిశ్వాసు లనియు నిందించుట యన్యా
యము. కావున ఈ యుగమునందు ఏ స్థిరమతసిద్ధాంత
మొ గాక సత్యమునె విద్యావంతుల ముందు పెట్టుట
యత్యంతావశ్యకము. "ఒక సంపూర్ణ నిర్వచన మిచ్చు
టకు సాధ్య మయినయెడల, నామట్టుకు నేను దైవము
సత్య మని నిరూపించుకొంటిని. కాని రెండు సంవత్సరము
లక్రిందట నే నింకను ముందునకు పోయి సత్యమె దైవ
మని నిర్ణయించితిని. దైవము సత్య మనుటకును సత్యము
దైవ మనుటకును గల సూక్ష్మతారతమ్యము గ్రాహ్య
మై యుండును. దాదాపుగ నేబదిసంవత్సరములనుండి
యెడతెగ కుండ సత్యమునకై సలుపబడిన తీవ్రపరిశోధ
నమూలముననె నే నట్టి పర్యవసాయమునకు వచ్చితిని"[1]

1. If it is possible for the human tongue to give the fullest and description, I have come to the conclusion that for myself God is Truth. But two years

అని మహాత్మాగాంధి నుడివెను. సర్వమానవులు సత్య నిరతు లయి సత్యముకొరకు జీవించుట కుత్సాహపడు దురు. సత్యమె దైవ మని వ్యక్తపరచుటవలన వారెల్ల రకు దైవమునుగురించి సరి యయిన యభిప్రాయము కలుగ గలదు; యథార్థదైవభక్తి యలవడి సఖ్యజీవనము సిద్ధించును. ఈ నవయుగమునందు సత్యమును ఆదర్శ ముగ కనపరచుటమూలమున ఆస్తికభావము భౌతికవి జ్ఞాననిరతు లగు విద్యావంతులలో సయితము తప్పక విస్తరించును.

### ము వ్యక్తిగతము

సత్యమునుగురించి విచారించుటకు ప్రతిమనుష్యుడు శక్తివంతు డై యున్నాడు. ఒక గురువు చెప్పె నను

ago, I went a step further and said Truth is God. You will see the fine distinction between the two statements, viz. that God is Truth and Truth is God And I came to that conclusion after a continuous and relentless search after Truth which began nearly fifty years ago.

*Mahatma Gandhi: Young India 31—12—1931.*

కారణముచేతనో, లేక ఒక ధర్మగ్రంథము ప్రకటించె నను హేతువుచేతనో, లేక చిరకాలాచార మై వెలసినంత మాత్రముననో, ఏదియు సత్యముగ నీ కాలమున గ్రహింపబడదు. గ్రుడ్డివాడు నడచుటకు దృష్టి గల వాని సాహాయ్యమును బడయును; ఇతరోపాయముల నవలంబించును. కన్ను గల వాడు స్వతంత్రముగ చరించును. అటులనె వివేక హీనుడై యున్నప్పుడు, మానవుడు సహజముగ గురువునో, శాస్త్రమునో, ఆచారమునో యండగా జేసికొనును. వివేచనాశక్తి ప్రబలినకొలది, సర్వము తెలిసికొనుచు, సత్యమును తనకు తానె నిరూపించుకొనుట కాత డుద్యుక్తు డగును. పూర్వము జ్ఞానవంతులు స్వల్పసంఖ్యాకులుగ నుండి పామరు లయి బహుసంఖ్యాకులుగ నున్న జనులకు ధర్మమున దారి జూపి యుండిరి. కాని ప్రస్తుతము జ్ఞానవంతుల సంఖ్య పెరిగినది. కొన్ని దేశములలో జ్ఞానశూన్యులు పూర్తిగ లేరనియె చెప్ప వచ్చును. విద్వాంసులు పూర్వముకూడ సత్యమును స్వయముగ నిర్ణయించుకొనిరి. అట్లే నేడును స్వయంనిర్ణయపద్ధతి పరిశ్కృతపరిస్థితులనుబట్టి సర్వసాధారణ మగు చున్నది. అది నవయుగజీవనము పాలించు

మహాసూత్ర మైనది. "యథార్థమతము మన కభ్యాసము లైన పద్ధతులనుండి మనల లేవనెత్తి యొక గుంపులోని జనులవలె గాక ప్రత్యేకవ్యక్తులుగ పరిగణించును. స్వేచ్ఛాయుత మైన వ్యక్తిగతమతమువలన నే కీడు మూడునో యని సంశయించి, యీశ్వరనిర్దిష్ట మై సురక్షిత మగునట్టియు, నిర్ణీతసిద్ధాంతబద్ధ మగునట్టియు మత మెల్లరకు విధింప జూచు వారు, తాము కాపాడ నెంతో యాతురపడు సత్యమును శాంతియు పెంపొందునట్టి పరిస్థితులనె భంగపరతురు."[1] అని పండిత రాధాకృష్ణన్ నిరూపించెను. మతమునకు పునాది యిక గురూపదేశము గాని, శాస్త్రోదేశము గాని, ఆచారనిర్బంధముగాని కానేరదు; వాని స్థానము నంతరాత్మప్రబోధ మాక్రమించును. గురువులును శాస్త్రములును ఆచారములును,

1. True religion lifts us out of our ruts, treats us as individuals and not units in a crowd. Those who are suspicious of free personal religion and wish to impose on all a divinely guaranteed dogmatic creed endanger the interests of truth and stability which they are so anxious to conserve.

*S. Radhakrishnan: An Idealist View of life. p.80.*

పూర్వుల యనుభవములను తెలుపుచు స్వయంకృషికి తోడ్పడును; స్వతంత్రజీవనమునకు సహాయభూతములుగ నుండును. వ్యక్తిగతమతమె సర్వసామాన్యముగ వ్యాప్తి గాంచును.

## వ్యక్తి సాంఘికజీవి

వ్యక్తి కింత ప్రాధాన్యత నియ్యబడిన తరువాత సంఘజీవనమునకు చో టెక్కడ? ఆదిమకాలమందు జీవించిన విధమున మానవు లెవరికివారు జీవింపవలసిన దేనా? సంఘములుగ గూడి వృత్తులను విద్యలను కళలను నాగరికతను నీతిని ధర్మమును మానవులు పరస్పర సాహాయ్యముతో వృద్ధి నొందించుట కెక్కడ నవకాశ ముండును? దేశములను శత్రుబాధనుండి కాపాడి శాంతిసుఖములతో వర్ధిల్ల జేయుటకు ప్రభుత్వము లెట్లు నిలచును? ఇట్టి వివిధప్రశ్నములతో వ్యక్తిస్వాతంత్ర్యమునుగూర్చి పలువురు పలు సందేహములు వెలిబుత్తురు. కాని వీరు ఒక ముఖ్యవిషయమును గమనింప కున్నారు. సృష్టియందలి సౌందర్యమునకంతకు కారణము వివిధపదార్థములద్వారమున వ్యక్తి

మగు వైచిత్ర్యమె. సమస్తపదార్థము లొక్క మోస్త
రుగ గుణరూపములం దుండినయెడల, ఒక వస్తువును
చూచిన తరువాత మరొక వస్తువును చూడ వలసిన
యవసర ముండదు. ఎప్పు డయిన నొకటి తరువాత
నొకటిగా నొకేవిధమయిన వస్తువులను గాంచుట తటస్థిం
చిన పక్షమున మనస్సున కెంత యేవగింపు జనించును?
ప్రతివస్తువు ప్రత్యేకరూపముతోను గుణముతోను విల
సిల్లు చున్నది గనుకనె, ప్రకృతి మిక్కిలి రమణీయముగ
నున్నది. ఎందరు మానవులో యిదివరకు జనించిరి.
ఇప్పు డెందరో జనించు చున్నారు. ఇంత మానవసృష్టి
సదా కలుగు చున్నను, ఒకని ముఖమును బోలు మరి
యొక ముఖము కాన్పింపదు. ఇంచుక తరచి చూచిన,
ఒకని స్వభావమును బోలు స్వభావము మరియొకటి
కనుగొన జాలము. మానవకోటి సయితము శోభాయ
మానముగ నుండవలెనన్న, ప్రతివ్యక్తి తన సహజస్వ
భావముతో వర్ధిల్ల వలెను. ఇందుకొరకె వ్యక్తివికాస
మున కెట్టి యాటంక ముండజనదు; వ్యక్తిస్వాతంత్ర్యము
అంగీకరింపక తప్పదు. కాని సంఘజీవనమునకు తావుం
డదా యను విషయము మాత్రము విచారణీయము.

శరీరవ్యాయామమునకు బాలుర నొకచో సమావేశ
పరచి బారులుగ నిలువబెట్టి యందరిచేత నొక్క విధ
మగు క్రీడలను శరీరవ్యాయామశిక్షకుడు చేయించు
నప్పుడు, మన కొక విధ మయిన సంఘజీవనము పొడగ
ట్టును. ఒక గొప్ప కార్యాలయమున భిన్నశాఖలందు
భిన్నాధికారులు భిన్నకార్యములు చేయుచు నా కార్యా
లయోద్దేశ మగు నేదైన మహత్తరకార్యమును నెర
వేర్చు నప్పుడు, మనకు మఱియొక విధమగు సంఘజీవ
నము గోచర మగును. వ్యాయామతరగతి యంత్రమును
పోలి యుండును. కార్యాలయము శరీరమువలె గాన్పిం
చును. వ్యాయామతరగతికి నుత్తరువు లొసంగునది
బాహ్యశిక్షకుడు. బాలురు యంత్రములోని చక్రము
లవలె నాతని యాజ్ఞానుసారము తమ యవయవముల
ద్రిప్పుదురు. వారిలో నెవ్వరికిని స్వేచ్ఛలేదు; స్వతంత్ర
సంచలనము లేదు. కార్యాలయములో నట్లు గాదు.
కార్యాలయప్రధానోద్దేశమున కనుగుణ మగు ప్రత్యేక
కార్యములు అధికారు లొక్కొక్కరు నిర్వర్తించు చుం
దురు. తత్కార్యనిర్వహణమునందు వారు స్వబుద్ధి నుప
యోగించి తమ నిపుణత యంతయు జూపవలసి యుం

దురు. వారు తమ క ర్తవ్యము నెంత నేర్పుతో గావిం చిన నంత శీఘ్రముగా కార్యాలయ సమిష్టిజీవనమునకు తోడ్పడుదురు. వ్యక్తులు సంపూర్ణ స్వాతంత్రము కలిగి తమ బుద్ధికుశలత యంతయు నుపయోగించుటకు కార్యా లయము లవకాశ మొసంగును. శరీరమందు వివిధాంగము లుండి ప్రత్యంగము తన ప్రత్యేకకార్యము నిర్వర్తించుచు సమ స్తశరీరజీవనమునకు సాయపడు రీతిని, కార్యాలయ మున కార్యాలయోద్యోగస్థులు చరింతురు. అంగాంగీ సంబంధమందు వ్యష్టి స్వాతంత్ర్యమునకు గాని సమిష్టి జీవనమునకు గాని భంగము కలుగదు. కావున శరీరము వలె సంఘమును, అంగములవలె వ్యక్తులును మెలగుట యావశ్యకము. "మానవసంఘ ప్రయోజనము, వ్యక్తి యుత్తమ వికాసము గాంచుటకు తోడ్పడుటయే. వ్యక్తి పూర్ణముగ వికసించిన కొలది, మానవకోటియందు ప్రక టిత మగు దేవత్వము నధికతరముగ ననుభూతము చేసి కొన గలుగును" అనియు, "నా రక్తనాళములందు

1. "Human society is for the best expression of man, and that expression, according to its perfection, leads him to the full realisation of the divine in humanity."

*Rabindranath: Creative Unity, page 23.*

ప్రవహించు జీవనస్రోతమె ప్రపంచమందును ప్రవహించుచు రాగతాళానుగుణముగ దివారాత్రములు నృత్యము సలుపు చున్నది. ఆ జీవనమె పృథ్వీతలముపై ధూళియందు లెక్క లేనన్ని పచ్చికమొలకల రూపమున నానందకరముగ నుద్భవిల్లి విచిత్ర పుష్పపత్ర తరంగములతో శోభిల్లును. ఆ జీవనమె జననమరణరూపమయిన సంసారసాగరమందు స్థితిలయముల నడుమ నుయ్యాలలూగును. ఈ విశ్వగత జీవన సంస్పర్శచే నా యంగములు వికసితము లగుచున్న వని నాకు తెలియుచున్నది. బహుయుగముల జీవనము ఈ క్షణము నా రక్తమునందు తాండవ మాడుటవలననె నే నధికుడ నని గర్వింప గలుగుచున్నాను." [1] అనియు రవీంద్రుడు వ్యక్తము

1. The same stream of life that runs through my veins night and day runs through the world and dances in rhythmic measures.

It is the same life that shoots in joy through the dust of the earth in numberless blades of grass and breaks into tumultuous waves of leaves and flowers.

It is the same life that is rocked in the ocean-cradle of birth and of death, in ebb and in flow.

చేయుచున్నాడు. వ్యక్తి యభివృద్ధి గాంచినకొలది, అది యెక్కువగ విశ్వముతో నైక్యము జెందును; దానికిని విశ్వమునకును సామరస్యము చేకూరును; భిన్నత్వము నందు నేకత్వము సిద్ధించును; "సోహం" అను భావము అనుభూత మగును. ఇట్టి యున్నతస్థితి పొంది యుండుట వలననె, బుద్ధుడు, జీసను, మహమ్మదు మున్నగు పూర్వమహాపురుషులును నేడు గాంధిమహాత్ముడును మానవసంఘమునకు సంబంధింపని ప్రత్యేకజీవనము తమకు లేనట్లు జీవించుట సాధ్యమగు చున్నది. కావున యథార్థమయిన యాధ్యాత్మికౌన్నత్యము బడయుటవలన,వ్యక్తి సంఘగత మగును; సంఘముతో నైక్యమగును; సంఘమునుండి విడివడుట గాని సంఘమునందు సంక్షోభము కలిగించుట గాని యెంత మాత్రము జరుగదు.

I feel my limbs are made glorious by the touch of this world of life. And my pride is from the life-throb of ages dancing in my blood this moment.

*Rabindranath: Gitanjali, page 64.*

## అహింస పరమ సాధనము

ఈ సంఘజీవనము గడపుటలో నవయుగమానవులు పాటింప వలసిన యాదర్శ మొకటి స్పష్టముగ చూప బడు చున్నది. మానవు డాదిమకాలమునుండి క్రమక్రమముగా నాత్మీయవికాసము గాంచి తోడిజనులతో నైక్య మగుచు స్వార్థరహిత మగు ప్రేమయుతజీవనము గడపుచునె వచ్చెను. కుటుంబమునందు పరిశ్రమమునను, రక్తబంధుగణమందు పిమ్మటను, ఒకప్రాంతమున కలసి జీవించు సమూహమందు నటుపిమ్మటను, ఏకదేశస్థులందు పరిష్కృతమునను నిర్మలప్రేమపూరితజీవనము అధికతరము గ వ్యాపింప దొడంగెను. వ్యక్తి కుటుంబమునందును, బంధుకూటమునందును, తెగయందును, జాతియందును, విలీనమగుచు స్వార్థమును సంపూర్ణముగ విడచుచున్నాడు. ఆ యావరణములందు వ్యక్తి తన ప్రత్యేకత్వము కోల్పోయి తనకు సంబంధించిన వారితో ప్రేమద్వారమున మిళిత మగు చున్నాడు. ప్రేమాస్పదుల యభివృద్ధికొరకు సర్వసుఖములు విడనాడుచున్నాడు; సకలకష్టములు పడు చున్నాడు; అవసరమైనచో ప్రాణమును సయితము త్య

జించు చున్నాడు. ఇది పవిత్రత్యాగ జీవనము. ఇందు హింసాయుత మగు నహంకార జీవనము లేదు. ఇదియె అహింసాజీవనము. ఈ యహింసా జీవనము, ప్రపంచ ము మొత్తముమీాద చూచిన, జాతివరకు అనగా దేశ సరిహద్దులవరకు ప్రాకి యంతటితో నాగినది. దేశభేదము కూడ పాటింపక సర్వమానవులను ప్రేమింపగలిగిన వ్యక్తులు అచ్చటచ్చట పూర్వమునందు లే రని చెప్పుట లేదు. ఆ మహానీయుల కృషిమూలముననె అహింసా జీవనము కుటుంబమును దాటి బంధుకోటియందును, బంధుకోటిని దాటి తెగయందును, తెగను దాటి జాతి యందును విస్తరించినది. కాని స్వార్థము మాత్ర మెప్పటి కప్పుడు నొక రూపమున గాకున్న మరొక రూపమున మానవుల నంటియె యుండి నిలుచు మన్నది. కుటుంబ మునందలి భిన్నవ్యక్తుల నడుమ స్వార్థము నశించును; కాని ఒకకుటుంబము మరొకకుటుంబముతో వ్యవహరించు నప్పుడు స్వార్థముకనపరచును. అప్పుడు బంధుకోటియందు నహింసాజీవనము నెలకొల్పు ప్రయత్నము ప్రత్యేకముగ జరుగును. అటులనె తెగయందును, జాతియందును అహిం సా జీవనము విస్తరింప జేయు నుద్యమములు వేర్వేరుగ

బయలు దేరును. ప్రస్తుతము అని దేశముల నతిక్రమించి
యావలకు పోవుటలేదు. తమ దేశముకొరకు నెంతటి
త్యాగ మైనను చేయువారు ప్రతి దేశములోను పలువు
రుండుటచేత నె, బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, జర్మని,
రష్యా, జపాన్ మున్నగు దేశములందు జాతీయభావము
తీవ్రముగ ప్రజ్వలించినది. జాతీయతయందు వెనుకబడి
యున్న దేశములవారు కూడ జాతీయోద్యమముల నడ
పుకొనుచు స్వజాతి నిర్మాణమునకు గడంగుచున్నారు.
జాతీయాభిమానము మిక్కుటముగ నీకాలమున నున్న
దని యొప్పుకొనక తప్పదు. కాని భిన్నజాతుల నడుమ
విద్వేషము లెంత ప్రబలియున్నవో గాంచుడు. ప్రతిజా
తియు నితరజాతుల నణగ ద్రొక్కుచు తాను వర్ధిల్లుటకు
పాటుపడుచున్నది. "భిన్నజాతులు కలియుటలో స్వజా
తీయ దురహంకారము అమితముగ పెంచుట యొక్క
టియె యింతవరకు పూర్తిగ జరిగిన కార్యము. మానవ
చరిత్రయందు నే కాలమందును, ప్రస్తుతము వెలిబుచ్చ
బడు నంతగా, ఈర్ష్య, దురాశ, ద్వేషము, అవిశ్వా
సము మున్నగు నీతిబాహ్యము లగు దుర్గుణములు చెల
రేగి యుండలేదు. బలిష్టమయినది కానిండు, లేక బల

హీనమయినది కానిండు, ప్రతిజాతియు అన్యజాతులకు నత్యంతహానికరము లగు మార్గము లారయుచు క్రూర చింతనలయందు సదా మునిగి తేలుచున్నది*[1] అని రవీంద్రుడు స్పష్టముగ తెలుపు చున్నాడు. ఈ భయంకర జాతీయత వలననె యిటీవల ఐరోపామహా సంగ్రామము జరిగెను. ఇంకొక ఘోరయుద్ధము త్వరలో జరుగ గల పరిస్థితులు గాన వచ్చుచున్నవి. కావున నవయుగము నందు వివిధజాతులమధ్య అహింసాజీవనము వ్యాపింప జేసి సర్వదేశములను సంయుక్తప్రేమసామ్రాజ్యమున బంధించుట యత్యవసరము. అహింసావ్రతప్రభావము అంతర్జాతీయ సంఘర్షణములయందు ప్రత్యక్షము చేయుచు మహాత్మా గాంధి అహింసాజీవన చరిత్రమునందు

1. Hitherto the cultivation of intense race egotism is the one thing that has found its fullest scope at this meeting of men. In no period of human history has there been such an epidemic of moral perversity, such universal churning up of jealousy, greed, hatred and mutual suspicion. Every people, weak or strong, is constantly indulging in a violent dream of rendering itself thoroughly hurtful to others.
*Rabindranath: The Religion of Man, page 159.*

మరియొక పరికరణము చేర్చుచున్నాడు. నవయుగప్రవక్త యని ప్రసిద్ధి గాంచి యున్నాడు. "స్వజాతీయుల యిక్కట్టులను తొలగించుటకంటె మానవప్రకృతియందిమిడి యున్న పశుత్వమును నిర్మూలించుటకు నే నెక్కువ యాతురపడుచున్నాను ... ఇచ్ఛాపూర్వకముగ పరుల నిమిత్తము కష్టపరంపరకు లోనగు వారు తమ్ముమాత్రమె గాక యావన్మానవకోటి నభ్యున్నతి నొందింతు రని నేను నమ్మెదను. కాని తమ శత్రువులను జయించుటకు గాని, బలహీనజాతులనో వ్యక్తులనో స్వలాభమునకై లోబరచుకొనుటకు గాని గావించు ఘోరప్రయత్నములందు క్రూరత్వము వహించువారు తమ్ముమాత్రమె గాక సర్వ మానవకోటిని కూడ నధోగతి జెందింతు రని నయితము నేను విశ్వసింతును. మానవస్వభావము క్రౌర్యపంకిలముచే మలిన మగుట నాకు గాని మరెవ్వరికి గాని సంతోషకరముగ నుండజాలదు. మన మందరము ఒకే యీశ్వరసంతానమై యొకే దైవస్వభావము కలవారమైనయెడల, ఒకడు మన జాతికి చెందినను మరొక జాతికి చెందినను, వాడు చేయు పాపమునందు మన భా

గము మనము పంచుకొనవలెను.”[1] అనియు, అహింసా జీవనము పరిపక్వమగుటవలన సత్యస్వరూపుని సంపూర్ణ దర్శనము సంప్రాప్తము కాగల దను నదియె నా జీవిత పరిశోధన లన్నిటివలన నిర్ధారిత మయిన యంశ మని మాత్రము నేను దృఢముగ జెప్పగలను[2] అనియు

1. I am more concerned in preventing the brutalisation of human nature than in the prevention of the sufferings of my own people...I know that people who voluntarily undergo a course of suffering, raise themselves and the whole of humanity, but I also know that people who become brutalised in their desparate efforts to get victory over their opponents or to exploit weaker nations or weaker men, not only drag down themselves but mankind also. And it cannot be a matter of pleasure to me or any one else to see human nature dragged to the mire. If we are all sons of the same God and partake of the same divine essence, we must partake of the sin of every person whether he belongs to us or to another race.

*Mahatma Gandhi: Young India 29—10—1931.*

2. But this much I can say with assurance, as a result of all my experiments, that a perfect vision of Truth can only follow a complete realisation of Ahimsa.

*Mahatma Gandhi: Autobiography Vol. II, p. 591.*

గాంధి మహాత్ముడు ప్రవచించు చున్నాడు. అహింసను
భిన్నజాతుల పురోవృద్ధికిని, ప్రపంచశ్రేయమునకును,
ఈశ్వరసాక్షాత్కారమునకును పరమసాధనముగ మహా
త్ముడు కనపరచు చున్నాడు. అహింసాగ్నియందు స్వార్థ
ము దగ్ధ మై హృదయము పరిశుద్ధ మగును. సర్వమాన
వులు పరస్పరప్రేమయందు బద్ధు లయి యొకరి మేలు
కొరకు మరియొకరు పాటుపడుటకు యత్నింతురు. ఈ
యన్యోన్యప్రేమజనిత జీవనమునందు సత్యస్వరూపు డగు
సర్వేశ్వరుడు తేజరిల్లును. సత్యస్వరూపుని నూతనలీలలు
సర్వజాతిసమ్మేళనమునందు, యావత్ప్రపంచ కల్యాణము
నందు మానవు లిక గాంచ వలయును. యుద్ధములతో
సర్వదేశముల వారు విసుగు జెంది యున్నారు. ప్రజా
పరిపాలనము, స్వపరిపాలనము మున్నగు ఘన మయిన
నామములతో దేశములు తమ ప్రభుత్వములను నడపు
కొనుచున్నవి; కాని ఎంత హీనస్థితియం దున్నను ప్రతి
మానవవ్యక్తి సత్యముయొక్క మూర్తియె యని యవి
గౌరవింపజాల కున్నవి. ఇప్పటికిని ప్రతిదేశమునందు
నెందరో హీనులుగ పరిగణింపబడు చున్నారు; ప్రతి
దేశమువారు విదేశీయులను విరోధులుగ లెక్కించు

చున్నారు. ప్రత్యేక జాతులందును ప్రపంచమునందును స్వపరభేదభావములు నశించి మానవకోటి యంతయు నేక విశాలకుటుంబముగ పరివర్తనము జెందుటకు, గాంధిమహాత్ముడు తనకొరకు నియమించుకొనిన యాదర్శము "నేను పూర్తిగ స్వార్థ శూన్యుడను గావలెను. తన తోడిజనులలో చిట్టచివరి స్థానము తన యిచ్ఛానుసారము తాను ఆక్రమించుకొన నంత కాలము, ఎవ్వనికిని మోక్షము లేదు. వినయముయొక్క పరమావధియె యహింస"[1] యనునది సర్వదేశస్థులు అనుసరించుటకంటె గత్యంతరము లేదు. ప్రజాప్రభుత్వ మనబడు రాజకీయసంస్థవలెనింక ననేక సాంఘికమతసంస్థలు నానావిధము లయిన యుత్తమనామములతో బయలుదేరును; కాని ఆ సంస్థలు వాని మూలోద్దేశములకె కాలక్రమమున విరుద్ధముగ మారిపోవు చున్నవి. వానికి జెందినవారు ఆదర్శము

1. I must reduce myself to zero. So long as one does not of his own free will put himself last among his fellow-creatures, there is no salvation for him. Ahimsa is the farthest limit of humility.

*Mahaιma Gandhi: Autobiography Vol. II, p.593.*

లను విడిచి స్వార్థపూరితు లగుచు వానిని సంకుచితస్థితికి దెత్తురు. కావున "ఏ నూతనసంస్థయం దైనను నాకు విశ్వాసము లేదు. కాని విశుద్ధసత్యము ప్రకటించుటకు సాధనభూతు లగుచు స్వార్థరహితముగ చింతించు నట్టియు, హృదయపూర్వకముగ ప్రేమించు నట్టియు, ధర్మానుగుణముగ వర్తించు నట్టియు యావత్ప్రపంచమున విలసిల్లెడు వ్యక్తులందు నాకు విశ్వాసము గలదు."[1] అని రవీంద్రుడు చెప్పి యుండెను. సంస్థలయందు జీవ మున్నను, లే కున్నను, వానిని పట్టుకొని ప్రేలాడుచు వాని నెవ్విధముననో పోషించుచు నదియె ఘనకార్యముగ తలపోయు వారు గొప్ప భ్రమయందు తగుల్కొను చున్నారు. ధర్మవ్యక్తు లుద్భవిల్లు చుండినయెడల వారి కృషిమూలమున సంస్థలు సజీవము లై కాలానుగుణ మగు మార్పులతో వర్థిల్లుచు నుపయోగకరము లగును.

1. Therefore I do not put my faith in any new institution, but in the individuals all over the world who think clearly, feel nobly, and act rightly, thus becoming the channels of moral truth.

*Rabindranath: Creative Unity, page 153.*

జ్ఞానము, ప్రేమ, నీతి వ్యక్తులందు పెంపొందించు ప్రయత్నములు ముఖ్యముగ జరుగుచుండిన యెడల, సంస్థల విషయమై ఆతురపడవలసిన యావశ్యకముండదు. సంస్థలు మానవుల కొరకు నియమింపబడును గాని మానవులు సంస్థల కొరకు సృష్టింపబడుట లేదు. గృహములు నివాసయోగ్యములుగా నుండుటకు నవి యెప్పటికప్పుడు పరిశుభ్రము చేయబడుచు నవసరమగు రీతిని మార్పబడుచు నుండును. అట్లే సంస్థల విషయమున సంస్కరణము జరుగవలెను. మాత్రప్రాయులగు వ్యక్తులు ఆ కార్యము నిర్వహింప జాలరు. ఆత్మశక్తియుతులగు మానవులె యందులకు సమర్థులు. అంగబలమునందు గాక ఆత్మబలమునందు దృష్టి నిలుపుడనియె నేటి యాదేశము.

## స్వధర్మము సర్వోత్తమము

ఒక జాతిని మించి మరొక జాతి విజృంభింప వలెనను నాశయము పోటీపడుటకును పోరాడుటకును ప్రాణములు దీసికొనుటకును మానవుల ప్రేరేపించు చున్నది.

ఆ సంఘర్షణాజీవనము జాతికిని జాతికిని సహము నుండు టయే గాక ఏకజాతిలోని వ్యక్తులకును సంక్రమించు చున్నది. ప్రతివ్యక్తి తన యభిరుచులకును తనశక్తులకు ననుగుణముగ సహజ వికాసము గాంచి తన యర్హస్థాన మున నిలిచి తన విధ్యుక్తకార్యమును నిర్వర్తించుట వాంఛనీయమె. కాని యెక్కువ ద్రవ్యార్జనమునకో, లేక యెక్కువ కీర్తిసంపాదనమునకో, లేక యే యితరసా మాన్యోద్దేశ సాఫల్యమునకో సాయపడు నని వ్యక్తులు ఒకేవృత్తియందును ఒకేయుద్యమమునందును ప్రవేశించి పెనగులాడు చున్నారు. ఇందువలన వ్యక్తుల సహజవృద్ధి కిని కార్యముల శ్రేష్ఠత్వమునకును నష్టకరముగ నున్నది. మీదు మిక్కిలి వైషమ్యములును కలహములును పెరు గుచున్నవి. "బాగుగ నాచరింపబడిన పరధర్మముకంటె, స్వధర్మము హీనమయినదె యైనను శ్రేష్ఠతరము. స్వధ ర్మ నిర్వాహణమందు మరణము ప్రాప్తించినను మేలె. పరధర్మ మాత్మభ్రష్టకరమగుటచే భయావహము"[1] అను

1. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః

భగవద్గీత III-35.

భగవద్గీతావాక్యము నందలి శాశ్వత సత్యము ఈ యుగ మున నేమాత్రము పాటింపబడుట లేదు. వ్యక్తులను స్వధర్మమునందు నియుక్తుల జేయుట ప్రథమకర్తవ్యము; స్వధర్మనిర్వహణమునందు అహింసాపథము నవలంబింప జేయుట ద్వితీయ కర్తవ్యము. ఇది ద్వితీయకర్తవ్య మనుటచే అముఖ్యమయిన దని యెంచక ప్రథమకర్తవ్యము కంటె కూడ ముఖ్యమయినదిగ నెంచ వలెను. స్వధర్మము సాధించుటలో పరు లడ్డుపడు చున్నను, వారలకు హింస యెంతమాత్రము కలిగింప జనదు. స్వధర్మముకొరకు సర్వ విధముల కష్టపడవలెను. అవసరమయినచో మృత్యువాలు కావలెను. విత్తనము భూమిలో పడి వినాశము జెందుటమూలముననె, వృక్షజీవనము సంభవ మగుచున్నది. ప్రమిదలోని తైలము దగ్ధమై పోవుట చేతనె, వెలుతురుద్భవిల్లు చున్నది. పంచదార కరగి పోవుటచేతనె, నీరు మధురమగుచున్నది. వ్యక్తి యీ తీరున తన ధర్మమును నిర్వర్తింపవలెను. తన ధర్మము త్యాగద్వారమున నిర్వహింప గలుగు నప్పుడు, దాని స్వచ్ఛతయు నాధిక్యతయు నిరూపితము లగును. "వినాశముమధ్యను జీవనము అంతరింపక పెంపొందు చున్నది కావున, జగత్తున సంహారణ

విధానముకంటె నున్నత మయిన విధానము మరొకటి యుండితీర వలె.నని నేను కనుగొంటిని. ఆ విధాన మను సరింపబడు నప్పుడు మాత్రమె, సక్రమపద్ధతిని సంఘము విలసిల్లగల దని యూహింప దగును; జీవితము జీవింప దగినది యగును. ఈ విధానము ననుసరించి పాటుపడిన కొలది, నేను జీవితమాధుర్యమును సృష్టిపరిణామసౌంద ర్యమును గ్రహింప గలుగుచున్నాను. తద్వారమున నాకు పరమశాంతి చేకూరినది. సృష్టిరహస్యముల యవర్ణనీయ పరమార్థము వెల్లడి యైనది.*[1] అనియు, "ప్రేమవిధాన ము ప్రపంచమును పాలించుచున్నది. మృత్యుగహ్వరము నందు జీవనము ప్రజ్వలించు చున్నది. వినాశము విరా

1. I have found that life persists in the midst of destruction and therefore there must be a higher law than that of destruction. Only under that law would a well ordered society be intelligible and life worth living.

The more I work at this law, the more I feel the delight in life, the delight in the scheme of the universe. It gives me a peace and a meaning of the mysteries of nature that I have no power to describe.

*Mahatma Gandhi: Young India 1—10—1931.*

మము లేకుండ జరగుచున్నను, విశ్వము వర్ధిల్లుచునె యుండును."[2] అనియు మహాత్మా గాంధి స్వానుభవముతో నుద్ఘోషించుచున్నాడు. ద్వేషమును, ఈర్ష్యను త్యజించి ప్రేమవిధాన మనుసరించి సర్వవ్యక్తులు సహజవికాసము బడయుచు మానవలోకమును శృంగారవంతముగ జేయుదురు గాక!

## దరిద్రనారాయణోపాసనము

తనయందు దేవత్వ మున్నట్లె సర్వమునందు దేవత్వ మున్న దని బ్రహ్మద్రష్టలు మొదటినుండియు చెప్పుచుండిన యంశమె. కాని యది యనుభూత మగుటలో మానవులకు మొత్తముమీద కొన్ని శ్రేణులు మాత్రమె విస్పష్టముగ ద్యోతము లయ్యెను. సృష్టిలో మహత్తరము లయి విస్మయము గొల్పు సూర్యుడు, అకాశము,

2. The law of love governs the world. Life persists in the face of death. The universe continues inspite of destruction incessantly going on.

*Mahatma Gandhi: Young India 23—10—1924.*

వాయువు, అగ్ని, సముద్రము, నది, పర్వతము, వృక్షము మొదలయినవి భగవత్స్వరూపములుగ నర్చింపబడుచున్నవి. ధర్మోద్ధారకు లగు మహాపురుషులు, రాముడు కృష్ణుడు, బుద్ధుడు, జీసను, మహమ్మదు మున్నగువారు, అవతారపురుషులుగ పూజింపబడు చున్నారు. ప్రాణపోషకు లయి భక్తిభాజనులుగ నున్న మాత, పిత, భర్త, మిత్రుడు, ప్రభువు మొదలగు వారు దైవసన్నిభులుగ గౌరవింపబడు చున్నారు. ఆనందసంధాయకు లగు ముద్దుబిడ్డలు ఈశ్వర స్వరూపులుగ ప్రేమింపబడు చున్నారు. భగవానుడు సూర్యు డని, రాము డని, పిత యని, సంబోధింపబడు నప్పుడు, భగవంతుని సూర్యత్వమును రామత్వమును పితృత్వమును అనగా నా మూర్తులద్వారమున వెల్లడియగు ఈశ్వరుని ప్రత్యేకగుణములు గ్రహింపబడు చున్నవి. నిర్గుణ నిరాకార పరబ్రహ్మ జగత్తుద్వారమున వ్యక్తమగుచు సగుణుడును సాకారుడు నై వెలుగొందు చున్నాడు. సగుణ సాకార పరమేశ్వరుని సాక్షాత్కారము వలన నిర్గుణ నిరాకార పరబ్రహ్మ చింతనీయుడు అగు చున్నాడు. సగుణోపాసనను సర్వమానవులు సాధారణముగ సలుపుచునె యుందురు. కాని సృష్టిలోని మహా

త్మ్యము, రక్షకత్వము, పోషకత్వము, సౌందర్యము మున్నగు ప్రశస్తము లయిన గుణములు మానవుల దృష్టిని సామాన్యముగ నాకర్షించును; అవి ఈశ్వరుని కారోపింపబడును. సృష్టిలోని విభూతితో జతపరచి భగవంతుని లక్ష్మీనారాయణు డని పిలుచుట పరిపాటి యయినది. కాని సృష్టియందు లేమి యెంతయో కలదు. ఈశ్వరు డనంతు డై యుండ, ఆతను పరిమిత మయిన జగద్రూపము దాల్చి నప్పుడు, ఈశ్వరుని ముందు జగత్తంతయు క్షుద్రమే యనవలెను. ప్రపంచమునందు నంధకారము; కురూపము, అహంభావము, అజ్ఞానము, దుష్టత్వము మొదలుగా గల లోపము లెన్నియో గలవు. ఒక విధముగా పరీక్షించినచో, సృష్టిలో నైశ్వర్యము కంటె దారిద్ర్యమె యెక్కువగా గాన్పించును. దారిద్ర్యమును విడిచి యైశ్వర్యము లేదు. దారిద్ర్యమునం దైశ్వర్య మిమిడి యున్నది. దారిద్ర్య మన్న మనకు నసూయ. దాని దరి జేరము. దరిద్రులను తిరస్కరింతుము; అణగ ద్రొక్కుటకు, వీ లైనచో నిర్మూలించుటకు యత్నింతుము. ఈ ధోరణినె ప్రపంచమునం దింత వరకు ధనము, విద్య, నాగరికత, నైతికజీవనము మున్న

గు వానియందు వెనుకబడి యుండు వారు అతిహీనము గ జూడబడు చుండిరి. పాశ్చాత్యదేశములందు అనాగరికజనులు అడవిమృగములవలె వధింపబడిరి. హిందూదేశమునందు ఆదిమజాతులు నేటికిని నూరివెలుపల వసింపవలసి యున్నారు. ఎంతటి యుపయోగకర మైన వృత్తి సల్పుచు సంఘశ్రేయమునకు పాటుపడు చున్నను, దరిద్రుడు నేడు ప్రపంచమం దంతటను అధముడు గ పరిగణింపబడు చున్నాడు. పుట్టుకతో నెవ్వరు నైశ్వర్యవంతులు గారు. తల్లిదండ్రుల తోడ్పాటువలన, గురువుల శిక్షణమువలన, తోడివారల సాహాయ్యమున, ఎవ్వ రైనను ఏ యైశ్వర్య మైన బడయ గలుగు చున్నారు. జన్మముతో నెల్లరు దరిద్రులే; అసహాయులె. ఈ సర్వసాధారణవిషయము విస్మరింపబడు చున్నది. ఈ యుగమునందు ధనికులకును దరిద్రులకును తీవ్రమయిన పోరాటము జరగుచున్నది. ధనికులె రాజ్యము లేలు చున్నారు; వ్యాపారములు చేయు చున్నారు; కులపెద్ద లగుచున్నారు; ధర్మకర్త లగు చున్నారు. ధనికులు తమ ప్రయోజనములనె, తమ లాభములనె చూచుకొనుచు దరిద్రులను నికృష్టస్థితియం దుంచు చున్నారు. భరతవర్షమునం దేమి,

 

ఇతరదేశములం దేమి, ధర్మాత్ములు దరిద్రు లయినను పూజింపబడుట వాస్తవము. దరిద్రు లన్న నైహిక సంపదలేని వారె యని భావింప జనదు. ఆముష్మిక సంపద లేని వారిని కూడ దరిద్రు లని పిలువ దగును. ఐహికసంపద గాని యాముష్మిక సంపద గాని యేదియు లేని దరిద్రులకు నే దేశమునందును నాదరణము లేదు. దరిద్రులు కూడ నీశ్వరాంశసంభూతులె యని గుర్తించి దరిద్రులను సన్మానించుటకు ఈ కాలపు అగ్రజాతులవారు నేర్చుకొన వలసి యున్నారు. ఈయుగమున ఈశ్వరుని దరిద్రనారాయణరూపమున నారాధింప వలె నని మహాత్మా గాంధి యుపదేశించు చున్నాడు. భగవంతుని పాదపీఠము దరిద్రుల నివాసస్థలములందు గల దని[1] రవీంద్రనాథ కవి వర్ణించి యున్నాడు. దరిద్రులయందు ఈశ్వరుని దర్శించి సర్వదేశములవారు ధన్యులు కావలసి యున్నారు. హిందూమతమునకు అస్పృశ్యతాదోషము మహాకళంకము. తన్నివారణము

1. Here is thy footstool and there rest thy feet where live the poorest, and lowliest, and lost.

*Rabindranath: Gitanjali, page 8.*

నకు బద్ధకంకణు డై మహాత్మా గాంధి నిలచి యున్నాడు. అస్పృశ్యత నిలచి యుండిన హిందూమతము నశించు ననియు, హిందూమతము నిలువవలసి యున్న, అస్పృశ్యత నశింపవలె ననియు ఆతడు చాటుచు అస్పృశ్యతానిర్మూలనమునకై తన ప్రాణము నయిత మర్పించుటకు సిద్ధముగ నున్నాడు. ఆతడు దరిద్రులపక్షము వహించి వారితో నైక్యము జేసికొను చున్నాడు. "నేను తిరిగి జన్మ మెత్తవలసి యుండిన యెడల, నేను అస్పృశ్యునిగ జన్మింప వలెను. అస్పృశ్యుల దుఃఖములు, బాధలు, వారు పొందెడు దూషణతిరస్కారములు నేను కూడ ననుభవించి యీ విచారకర మైన స్థితినుండి నన్నును వారిని తొలగించుకొనుటకు వాంఛించు చున్నాను."[1] అని యాతడు చెప్పు మాటలు ఆతని హృదయవేదనను వెలిబుచ్చు చున్నవి. దీనజనోద్ధరణము ఈ యుగమున ముఖ్యముగ సాధింప వలసిన యాదర్శము.

1. But if I have to be reborn, I should be born an untouchable, so that I may share their sorrows. sufferings, and affronts levelled at them, in order that I may endeavour to free myself and them from that miserable condition.

*Mahatma Gandhi: Young India 27—4—1924.*

## మాతృదేవీ సంసేవనము

కుటుంబములందు నేడు కలవరము ప్రవేశించినది. పురుషులు స్త్రీలను అణచి యుంచుటను మాన లేదు. దానికితోడు స్త్రీలకు పోటీపడుజీవనము సంక్రమించినది. వారు పురుషులతో పోటీపడుచు పురుషులవలె జీవించుటకు యత్నించు చున్నారు. పురుషులకు లోబడి యుండుటచే స్త్రీలు తమ సహజవికాసము గాంచ జాలకున్నారు. అందువలన వారియం దిటీవల తిరుగుబాటు బుద్ధి జనించినది. స్త్రీ తన స్వాతంత్ర్యము కోల్పోవ నిచ్ఛగింపదు. తన స్వభావము ననుసరించి పెరుగుట కభిలషించును. స్త్రీల జీవితమును నియమించి నడపుటకు పురుషుల కెట్లు సాధ్య మగును? స్త్రీ స్వతంత్రముగ నభ్యున్నతి గాంచుటమూలమున, ఆమెవలన లోకమునకు కలుగవలసిన ప్రయోజనము కలుగ గలదు. పురుషుడు శరీరబలము కలిగి యుండుటచే స్త్రీని నణచి యుంచెను. అందువలన పురుషాధికారము కుటుంబమునందు, సంఘమునందు, రాజ్యాంగమునందు ప్రబలుచు కఠినపద్ధతులు ప్రచలితము లయినవి. శాంతియుత ప్రేమవిధానములు

సర్వత్ర వ్యాపింప వలె ననిన, స్త్రీలకు వారి యర్హస్థా
నము లభింప వలెను; సహజవికాసము చేకూర వలెను.
శాంతిప్రేమగుణములతో నధికతరముగ గూడి స్త్రీ
స్వభావము పురుషస్వభావమునకు భిన్నముగా నున్నది.
ప్రపంచమందు ప్రకృతము మితిమీరి పోవుచు మహో
పద్రవమౌగ నున్న పురుషస్వభావముయొక్క తీవ్రత
తగ్గవలె నన్న, స్త్రీలు స్వాతంత్ర్యము బడసి పురుషులతో
సమానముగ చరించు దినములు రావలెను. వివాహ
మనునది వారిపాలిటకి బానిసత్వముగ పరిణమించినది.
అహింసాజీవనము, శాంతివాతావరణము నెలకొల్ప
యత్నించు చున్న గాంధి మహాత్ముడు తన యుద్యమ
మునందు స్త్రీలు ముఖ్యముగ తోడ్పడ గల రని విశ్వ
సించెను. ఆయన యొసంగిన ప్రోత్సాహమువలన నెం
దరో నారీమణులు-విద్యావతులె గాక సామాన్యగృహి
ణులు, పరదాస్త్రీలు-గృహప్రాంగణములను దాటివచ్చి
దేశాభ్యున్నతికై పాటుపడుచు తమ సహజశక్తిని వెల్ల
డించుచున్నారు. హిందూదేశమందు ఈ నవీనకాలమున
నింత విరివిగ స్త్రీలు ముం దెన్నడు ప్రజాసేవ సలిపి
యుండ లే దని నిశ్చయముగ జెప్ప వచ్చును. "భార్య

భర్తయొక్క బానిస గాక యాతని చెలికత్తె, సహాయురాలు, ఆతని సుఖదుఃఖము లన్నిటిలో సమభాగిని. తన జీవితమార్గమును నిర్ణయించుకొనుటలో భర్త యెంత స్వతంత్రుడో యామెయు నంత స్వతంత్రురాలె."[1] అనియు "నేను మన స్త్రీలు సంపూర్ణస్వాతంత్ర్యము బడయవలెనని యెంతయు వాంఛించు చున్నాను. బాల్యవివాహము లనిన నా కసహ్యము. బాలవితంతువును జూచుటకు నా హృదయము కంపించును. భార్య చనిపోయిన వెంటనె పశుప్రాయునివలె మరియొక వివాహము చేసికొను భర్తను చూచు నప్పుడు నేను పరితపింతును. తమ పుత్రికలను విద్యావిహీనల జేసి యజ్ఞానాంధకారమున నుంచి స్థితిపరుడగు నే యువకునకో కట్టిపెట్టుటకు మాత్రమె వారిని పెంచునట్టి తల్లిదండ్రుల నిర్దాక్షిణ్య మగు నన్యాయవర్తనమును గాంచునప్పుడు నేను చింతిల్లుదును.

1. The wife is not the husband's bondslave, but his companion and his helpmate, and an equal partner in all his joys and sorrows—as free as the husband to choose her own path.

*Mahatma Gandhi: Autobiography Vol. 1, p. 65.*

ఇంతవిచారము, ఆగ్రహము జెందు చున్నప్పటికిని, స్త్రీ సమస్యను పరిష్కరించుట మిగుల కష్ట మని కూడ గుర్తించుచున్నాను స్త్రీలు వోటుచేయు నధికారము కలిగి యుండవలెను. పురుషులతో సమానముగ స్త్రీలును రాజకీయము లయిన హక్కులను బడయ వలెను. అంతటితో స్త్రీ సమస్య పరిసమాప్తి జెందదు. దేశమునకు సంబంధించిన రాజకీయపర్యాలోచనములందు స్త్రీలు పాల్గొని క్రొత్త దోరణి కలిగించుట యీ సమస్యాపరిష్కారమునందు కేవలప్రారంభమె."[1] అనియు గాంధి

1. I passionately desire the utmost freedom for our women. I detest child marriages. I shudder to see a child widow, and shiver with rage when a husband just widowed with brutal indifference contracts another marriage. I deplore the criminal indifference of parents who keep their daughters utterly ignorant and illiterate and bring them up only for the purpose of marrying them off to some young man of means. Notwithstanding all this grief and rage, I realise the difficulty of the problem. Women must have votes and an equal legal status But the problem does not end there. It only commences at the point where women begin to affect the political deliberations of the nation.

*Mahatma Gandhi: Young India 21—7—1921.*

మహాత్ముఁడు వాదించుచు సంపూర్ణ స్త్రీ స్వాతంత్ర్యము నకై పోరాడు చున్నాఁడు. స్త్రీలు స్వతంత్ర లై తమ యుచితస్థానము కుటుంబమునందును, సంఘమునందును, రాజ్యాంగమునందును పొందినకొలది, కుటుంబములు, సంఘములు, రాజ్యాంగములు ప్రేమధామములుగను, శాంతినిలయములుగను, స్వర్గతుల్యములుగను పరివర్తనము జెందును. స్త్రీయొక్క నివాసమును, తిండిని, బట్టను, అందమును, కదలికను, కార్యములను తమ యిష్టాను సారము నిశ్చయించుచు పురుషులు నిరంకుశాధికారు లయి యున్నంతకాలము ప్రకృతప్రపంచమున ఘోరపద్ధ తులు మారవని దృఢముగ నమ్ముదుము గాక! ప్రారం భమునుండి స్త్రీ విషయమున ననేక దురభిప్రాయములు పురుషులు పెట్టుకొనిరి. పాపమునకు ప్రేరేపించి స్త్రీ పురుషుని భ్రష్టపరచు ననియు, స్త్రీబుద్ధి ప్రళయాంతక మనియు, ఇంక నిట్టి విపరీతభావము లెన్నియో పురుషు లకు గలవు. స్త్రీ కూడ నొక స్వతంత్రవ్యక్తి యనియు, స్వాధీనతవలననె స్త్రీ సహజవికాసము గాంచ గల దని యు, తనయందువలె స్త్రీయందును ఈశ్వరు డధివసించి యామెయభివృద్ధికి తోడ్పడు చున్నా డనియు పురుషుడు

గ్రహింపవలెను. పరమాత్మను ప్రభు డని, పిత యని, ప్రియు డని, మిత్రు డని పురుషనామములతో సంబోధించుట విశేషముగ పరిపాటి యగుటకు కారణము పరమాత్మయందలి స్త్రీత్వము, పురుషత్వ మంతగ, గ్రాహ్యము గా కుండుటయె. హిందువులు పరబ్రహ్మమునందు పితృత్వముతో బాటు మాతృత్వము కూడ నిమిడియున్నట్లు వెల్లడించుటయు, 'పితృ దేవో భవ' యను వచనముతో 'మాతృ దేవో భవ' యను వచనమును జతపరచి యుండుటయు, స్త్రీని సహధర్మచారిణిగ పరిగణించి యుండుటయు వాస్తవమె. ఇతరమతస్థులందు నిట్టి భావములు వ్యాప్తము లై యుండుటయు వాస్తవమె. కాని స్త్రీజన్మముకంటె పురుషజన్మము శ్రేష్ఠతరమయిన దని తలంచుచు పురుషుడు స్త్రీకంటె నధికుడై సర్వదేశములం దింతవరకు చరించియుండెను. పురుషుని బాహుబలమె మొదటినుండి యిప్పటివరకు మొత్తము మీద విజృభించెను; స్త్రీ తన హృదయప్రేమసౌరభము నిరాటంకముగ వెలిబుచ్చుటకు తగిన యవకాశము లేక పోయెను.

స్త్రీ స్వభావమునందలి శాంతిప్రేమలు సర్వత్రి ప్రస రించిననేగాని, మానవకోటియందు సుఖసంతోషములు, సహానసఖ్యతలు, సంపూర్ణ జీవనము వర్ధిల్ల నేర వని యీ యుగమున నంతకంత కెక్కువగ గ్రహింపబడు చున్నది. లోకకళ్యాణ ప్రదమగు పూర్ణవ్యక్తివికాసము మహాప్రేమ స్వరూపిణి యగు జగన్మాతను సేవిం చుటమూలమున సిద్ధింప గల దని అరవిందయోగి చెప్పుచున్నాడు. అతని యుత్తమబోధ నాలకింపుడు. "ఇట్టి పరివర్తనము మీరు కాంక్షించినయెడల, ఎట్టి యాక్షేప ణము గాని నిరోధము గాని పెట్టుకొనక విశ్వమాతకు లోబడుడు; ఆమె శక్తులకు వశము గండు; మీ జీవనవికా సమునకై ఆమెను నిరభ్యంతరముగ తోడ్పడ నిండు. అం దులకు మీ రామెశక్తిని పూర్తిగ నెరిగి యుండుటయు, ఆమె మార్పు నొందించుట కనుకూలముగ మీ స్వభా వములను మార్దవము చేయుటయు, ఆమె హస్తములం దెట్టి సంకోచము లేకుండ మీ జీవితము లర్పించుటయు నావశ్యకము."[1]

1. If you desire this transformation, put yourself in the hands of the Mother and her powers without

## ప్రాక్ప్రతీచీ సమ్మేళనము

భారతవర్ష మీ నవయుగమున ప్రకటించు చున్న
నూతనాదర్శమును గమనింపుడు. సత్యమె దైవము.
సత్యమునందు వివిధశక్తులు, విభిన్నగుణములు, విచిత్ర
కాంతులు, వేర్వేరు రుచులు అపారముగ నిమిడి
యున్నవి. మానవులు తమ కనుభూతమైనటుల సత్య
మును బహుభంగుల గ్రహించుచున్నారు. అట్టి యీశ్వ
రానుభవము వ్యక్తిగతము. "అహం బ్రహ్మాస్మి" అను
తత్త్వము గుర్తింపగలుగు నంతగ వ్యక్తియొక్క దృష్టి
విశాలవంతమైనయెడల, వ్యక్తి సకలేతరవ్యక్తులందును,
సర్వమానవకోటియందును, యావద్విశ్వమునందును అంత
ర్భూతుడై వెలసి యున్న పరమేశ్వరునితో నైక్య మ
గుచు సంపూర్ణముగ స్వార్థరహిత మగు త్యాగజీవన
ము గడపును; అహింసా విధాన మనుసరించుచు పరుల

cavil or resistance and let her do unhindered her work within you. Three things you must have, consciousness, plasticity, unreserved surrender

*Aurobindo: The Mother, page 75.*

కొరకు తాను కష్టముల పాలగును; స్వధర్మమును నిర్వ
ర్తించి జన్మము సార్థకపరచు కొనును; పరమాత్ముని,
హీనస్థితియం దున్న కృషికులయందు దరిద్రనారాయణ
రూపమున, స్త్రీలయందు మాతృదేవీరూపమున, దర్శించి
సేవించి లోకసంగ్రహమునకై తన జీవితము ధారపో
యును; ప్రాక్ప్రతీచీ దేశములలో గల సర్వమానవులు
జగదేకమాతయొక్క బిడ్డలని గ్రహింపగలుగును. తత్కా
లమున, పూర్వపశ్చిమము లైక్యత జెందుటకు, సమస్త
ప్రపంచమున శాంతిసఖ్యతలు నెలకొనుటకు సాధ్య
మగును. ఈ యాదర్శము సర్వ ప్రపంచవాసులు స్వీక
రింప వలయును; త దనుగుణముగ జీవింపవలయును. అది
తప్పదు.

విశ్వకవి రవీంద్రుడు చాటుచున్న ప్రకారము "మా
నవకోటియందలి భిన్నజాతులవారు ఇతరులతో సంబంధ
ము లేకుండ ప్రత్యేకముగ నున్నత ప్రాకారములనడుమ
తా మిదివరకు నివసించుచుండిన కోటలలోనికి ఇక ముం
దెన్నడు తిరిగి పోజాలరు. వారు నేడు శారీరకముగను
మానసికముగను పరస్పరసంబంధములోనికి వచ్చి యు

న్నారు. తమ కింతకాలము రక్షణ మొసంగిన యావరణముల జుట్టి యుండిన గోడలు బ్రిద్దలు కొట్టబడెను. మా నవప్రియత్నము వలన నవి మరల నిర్మాణము కా జాలవు. ఈ నూతన బహిరంగ ప్రదేశమున జీవించుటకు మన మనస్సులు పూర్తిగ నాయత్తపడ కున్నను, ఈ విశాలక్షేత్రములో భిన్నమానవులు స్వేచ్ఛతో మెలగుట వలన నంప్రాప్తము లగు బాధ లెన్ని యనుభవింప వలసి వచ్చినను, ఈ నవజీవనమును మనము పరిగ్రహించి తీరవలయును"[1]

1. The races of mankind will never again be able to go back to their citidels of high-walled exclusiveness. They are to-day exposed to one another, physically and intellectually. The shells which have so long given them full security within their artificial enclosures have been broken and by no artificial process can they be mended again. So we have to accept this fact, even though we have not yet fully adapted our minds to this changed environment of publicity, even though through it we may have to run all the risks entailed by the wider expansion of life's freedom.

*Rabindranath: The Religion of Man, p. 157.*

పండిత రాధాకృష్ణుడు నిరూపించు విధమున "ఆ నవ జీవనైక్యత, వివిధరూపములు దాల్చియున్న భిన్న జీవితములను ఏకరూపము నొందించు ప్రయత్నమువలన గాక, వానిని సమన్వయపరచుటమూలమున సాధింపవలయును. విభిన్నము లయిన యాదర్శములను స్వభావములను గలిగియుండు జాతులను సమ్మిళితము చేయుటద్వారా, ఒక యుత్తమమయిన నాగరికత యుద్భవిల్లును. ఈజిప్టు, బాబిలోను, హిందూదేశము, చైనా, గ్రీసు, రోము దేశములు ఈ యాథార్థ్యము నిదర్శనరూపముగ జూపియున్నవి. నేడు జరగు నాగరికతా సమన్వయము నందు పాల్గొనువారి సమూహము పెరిగినది; వారు దాదాపుగ యావత్ప్రపంచమందు నివసించుజనులై యున్నారు. భావికాలపు ధర్మ మిట్లుండును. ఒక జాతి మరొకజాతితో నైక్యమయి పోక భిన్నజాతుల సమమ సహకారజీవనము వెలయును. ఒకరు ఇంకొకరివలె జీవించుటకు యత్నింపక యెల్లరు పరస్పర సానుభూతితో తమ ప్రత్యేక జీవితముల గడపుదురు. సర్వభేదములు శూన్య

ము చేయుటవలన గాక వానిని కలిగియు సహనముతో వారు చరింతురు."[1]

సాధు అరవిందుడు ఈ నవయుగసాధకులకు వలసిన ఆదర్శమూర్తిని, జీవన్ముక్తుని తన యాత్మకు గోచరమై నటుల నభివర్ణించి యున్నాడు. అట్టి ధర్మనర్తను లగుటకు యత్నించి వారు ధన్యు లయ్యెదరు జీవన్ముక్తు డెట్టి వాడు? "ఆ మహాత్ముడు నశ్వరశరీరధారి యై భూతలమున జీవించుట కిచ్ఛగించును; కాని యాతడు అనశ్వరుడు. ఆతడు హద్దులు, బంధనములు మీరి యుండును. ఆతనికి అనంతకాలము క్రీడారంగము. ఘనకార్యములతో గూడిన జీవితము ఆతని వెంటనుండు ప్రజ్వలితఛాయ.

1. The unity of civilization is not to be sought in uniformity but in harmony. Every great culture is due to the blending of peoples of different ideals and temparaments. Egypt and Babylon, India and China Greece and Rome testify to this truth. To-day the circle of those who participate in the cultural synthesis has become wider and includes practically the whole world. The faith of the future is in cooperation and not identification, in accomodation to fellowmen and not imitation of them, in toleration and not absolutism.

*S. Radhakrishhan: Kalki, page 18.*

నిరీక్షించు చున్న జగత్తునకు పరమేశ్వరుని శక్తి నందిచ్చుటకు, అందు బాధింపబడు కార్మికులకు సంపూర్ణ శరణ్య మగు పరిశాంతి సమకూర్చుటకు, అందు చిరకాలాగతము లై జనుల పీడించు చున్న దుఃఖములను తొలగించి సుఖసంతోషముల నెలకొల్పుటకు, నిద్రాణ మైయున్న యాత్మీయశక్తులను మేల్కొల్పుటకు, ఆతడు వివిధ కార్యముల సలుపుచు జీవించును.”[1]

ఇట్టి యుత్కృష్టజీవితము గడపుటలో నగ్రసరు డగుచు మహాత్మా గాంధి యావత్ప్రపంచవాసులకు దారి తీయుచున్నాడు. పూర్వపశ్చిమ దేశస్థు లెల్లరు ఆతని ననుసరించుచు, విశ్వమానవకోటి యంతయు నేకకుటుంబముగ మారుటకు, పాటుపడుదురు గాక!

1. Although consenting here to a mortal body,
He is the Undying; limit and bond he knows not;
For him the aeons are a playground,
Life and its deeds are his splendid shadow.
Only to bring God's forces to waiting Nature,
To help with wide-winged Peace her tormented labour
And heal with joy her ancient sorrow,
Casting down light on the inconscient darkness,
He acts and lives.
*Aurobindo: Six poems, page 24.*

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౯ | ౩ | వస్తుల | వస్తువుల |
| ౧౭ | ౩ | ద్వైౖ.వోపాసనము | ద్వైవోపాసనము |
| ,, | ౧౯ | నిష్టలతో | నిష్ఠలతో |
| ౧౮ | ౧౮ | యుండు | నుండు |
| ౧౯ | ౫ | కధీనము | కధీనము. |
| ౨౩ | ౧౦ | నిష్ట | నిష్ఠ |
| ౨౯ | ౧౪ | a later days. | a later day. |
| ౩౨ | ౧౫ | దర్శింపబడెర | దర్శింపబడిరి. |
| ౩౬ | ౭ | యదార్థ | యథార్థ |
| ౪౬ | ౧ | ప్రెంచివారు | ఫ్రెంచివారు |
| ౫౨ | ౧౩ | శ్రేషములు | శ్రేష్ఠములు |
| ౫౬ | ౨౦ | Unive sep | Universe |
| ౫౮ | ౮ | జరుచుచున్నది. | జరుగు చున్నది. |
| ౬౧ | ౧౪ | Notions | Nations |
| ౬౩ | ౧ | సీర్వ్యాళువు | సీర్షాృళువు |
| ౬౮ | ౯ | వక్తులై | వ్యక్తులై |
| ౭౯ | ౧ | శిలము | శీలము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౯౪ | ౧౪ | ప్రకాసించు | ప్రకాశించు |
| ౧౦౨ | ౬ | మూలమున తమ | తమ |
| ౧౧౬ | ౪ | సమగ్రవికాసము | సమగ్రవికాసమును |
| ౧౧౮ | ౧౬ | తనపోయ | తలపోయ |
| ౧౩౫ | ౩ | మారుచ్చున్న | మార్చుచున్న |
| ౧౩౬ | ౧౮ | మొక్కయెటి | మొక్కటియె |
| ౧౪౨ | ౫ | తత్సమేళనము | తత్సమ్మేళనము |
| ౧౪౩ | ౨ | రవీంద్రు | రవీంద్రుడు |
| ,, | ౯ | రామానందుడు | రామానందుడు |
| ౧౪౮ | ౧౧ | కృషించినది | కృశించినది |
| ౧౫౬ | ౧౫ | యి | యిట్లు |
| ,, | ,, | కర్త | కర్తవు |
| ౧౫౯ | ౧౨ | తవనుండి | తననుండి |
| ౧౭౨ | ౧౦ | డనంతతుడును | డనంతుడును |
| ౧౯౮ | ౮ | తనయందు | తమయందు |

౬౫ వ పుటలోనున్న ఫుట్ నోటునకు ఈక్రింది వాక్యముకూడ చేర్పవలెను.

And can a civilization ignore the law of moral health and go on in its endless process of inflation by gorging upon material things?

# ప్రాక్ప్రతీచీ గ్రంథాలయము

## రాజమహేంద్రవరము

ఈ గ్రంథాలయ పక్షమున వెలువడు ప్రచురణములు:

### 1. ప్రాక్ప్రతీచీ గ్రంథమాల

ఇందు, సర్వజనసామరస్యమునకు తోడ్పడు ప్రాచ్య పాశ్చాత్య
దేశముల యుత్తమజ్ఞానము ఆంధ్రులలో వ్యాప్తము
చేయుటకు ఆంధ్రగ్రంథములు
ప్రచురింపబడును.

### 2. తదితర గ్రంథములు

గ్రంథమాలలో చేరని యితర విధములయిన గ్రంథములు
కూడ వెలువడు చుండును.

సంపాదకుడు

కామరాజు హనుమంతరావు

# ప్రాక్ ప్రతీచీ గ్రంథమాల

## నియమములు

1. గ్రంథమాలలో వెలువడు అట్టబెండింగు గల గ్రంథము వెల ఒక రూపాయి నాలుగు అణాలు. ఇది చందాదారులకు మాత్రము ఒక రూపాయికే యియ్యబడును.

2. అట్టి గ్రంథములు సంవత్సరమునకు నాలుగింటికన్న నెక్కువ గాకుండ నప్పుడప్పుడు ప్రకటింపబడును. వీనిని చందాదారులు విధిగా కొనవలెను.

3. గ్రంథాలయములో ప్రచురింపబడు తదితర గ్రంథములు కొని తీరవలయు నను బాధ్యత చందాదారులకు లేదు. కాని వారు కొనదలచిన, అవియు 20 తగ్గింపబడిన ధరలకు బడయవచ్చును.

4. పుస్తకము వెలువడునప్పుడు దాని విలువ మాత్రము చందాదారులు చెల్లింపవలెను: కాని తత్పూర్వము పుస్తకముల వెల నిమిత్త మేమయిన నీయవలె నను నిర్ణయము లేదు. ప్రవేశరుసుము నాలుగు అణాలు దరఖాస్తుతో గాని మొదట పుచ్చుకొను పుస్తకముల వెలతో గాని చందాదారులు చెల్లింపవలెను. పోస్టు ఖర్చులు మొదలయినవి వారె భరింపవలెను.

5. గ్రంథమాలలోని గ్రంథములు గైకొనుచు ధనసాహాయ్యము చేయ నుద్దేశించు అభిమానులలో పుస్తకమునకు రెండు రూపాయలు తక్కువ గాకుండ నిచ్చెడు వారు పోషకులుగ నెంచబడుదురు. రాజపోషకులు తమ యిచ్ఛానుసారము సాహాయ్యము చేయవచ్చును.

# ప్రాక్ప్రతీచీ గ్రంథాలయ ప్రచురములు

గ్రంథమాలలోనివి:—

1. పాశ్చాత్యభావప్రపంచము

కర్త: ఎమ్. వి. ఎన్. సుబ్బారావుగారు ఎమ్, ఏ.

2. హిందూజీవనపథము

సర్. డాక్టర్. ఎస్. రాధాకృష్ణన్ గారు రచించిన The Hindu View of Life అను గ్రంథమునకు కామరాజు హనుమంతరావుగారి అనువాదము.

3. నవ్యభారతోదయము

కర్త: కామరాజు హనుమంతరావుగారు.

పై గ్రంథముల వెల ప్రతి 1కి:

అట్ట బైండింగు రు. 1—4—0.
రేపరు బైండింగు రు. 1—0—0.

తదితరములు:—

1. జీవనస్మృతి

దేశిరాజు పెదబాపయ్యగారి జీవన చరిత్రము.

కర్త: కామరాజు హనుమంతరావుగారు.

వెల ప్రతి 1కి రు. 1—0—0

*2, Shakespeare and the Problem of evil*

Andhra University Extension Lecture by Mr. M, V. N. Subba Rao M. A.

Price per one copy Re. 0—8—0

పోస్టుఖర్చులు పైధరలకు ప్రత్యేకముగ చేర్చబడును. వర్తకులకు కమిషను ఈయబడును. వివరములను వారు గ్రంథాలయమునకు వ్రాసి తెలిసికొనవచ్చును.

# పాశ్చాత్యభావ ప్రపంచము

కర్త: ఆంగ్లభాషాకోవిదులును ప్రస్తుతము ఆంధ్రవిశ్వవిద్యాలయకళాశాలయందు ఆంగ్లభాషాధ్యాపకులునగు శ్రీ ఎమ్.వి.ఎన్. సుబ్బారావు ఎమ్. ఏ. గారు.

పాశ్చాత్య దేశములందు పందొమ్మిదవ శతాబ్దమున నూతన భావ తరంగములెట్లు బయలువెడలి విస్తరించెనో యీ గ్రంథమునందు విస్పష్టముగ వివరింపబడెను.

## కొన్ని యభిప్రాయములు

**కృష్ణాపత్రిక:**

"పాశ్చాత్య దేశములలోని ఉత్తమభావవిదుల యాశయములు వ్యాప్తినొందుట మన జాతీయప్రబోధమున కెంతయు నవసరమని అంగీకరింపక తప్పదు. జ్ఞానప్రపంచము దేశకాలముల కతీత మైనది. జ్ఞాన కిరణము ఏ దిక్కునుండి ప్రసరించినను, ఏ యుగమున బయల్వెడలినను, సర్వాదరణీయము. భాషలు పెక్కులు. సాహిత్యరీతులు భిన్నములు. దృక్కోణములును అనేకము. కాని జ్ఞానము సుస్వరూపమున నొక్కటి. ఈ సత్య మీ గ్రంథము పఠించిన సుబోధకమగును............గ్రంథకర్తయగు ఎమ్. వి. ఎన్. సుబ్బారావుగారీ గ్రంథమును బ్రిసాదించి ఆంధ్రుల కృతజ్ఞ [illegible]."

**భారతి:—**

"ఇయ్యది బి. ఏ. పరీక్షకు పఠనీయ గ్రంథముగ (B. A. Part II. Detailed Text) నిర్ణయింపబడుటయె దీని యాధిక్యతకు నిదర్శనము."

# హిందూ జీవన పథము

కర్త: ప్రపంచవిఖ్యాత తత్త్వజ్ఞులును ప్రస్తుతము ఆంధ్రవిశ్వవిద్యాలయమున వైసుచాన్సిలరు నగు శ్రీ సర్ డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ ఎమ్. ఏ. గారు.

అనువాదకుడు: కామరాజు హనుమంతరావుగారు.

హిందూధర్మ మెట్టి యుదారాశయములపై ప్రతిష్ఠితమయి భిన్నాభిప్రాయములను వివిధాచారములను సమన్వయపరచుచు సమీకరణము జేసి యథార్థ సమత్వభావము పెంపొందించెనో, అది మేల్కొని తిరిగి ప్రస్తుతపరిస్థితులందు ఎటుల కృషిసలుపవలెనో, సుబోధకముగ ఈ గ్రంథమునందు చర్చింపబడెను. అనువాదమునుగూర్చి తద్గ్రంథకర్తలగు శ్రీ రాధాకృష్ణగారిట్లు అభిప్రాయమొసంగిరి.

"మాతృకయందలి భావములను సరిగ ననువదించుటకు వారతిశ్రద్ధతో కృషిసలిపిరని పుస్తకమునందంతటను కానవగును. ఆంధ్రపాఠకలోకము వారి యనువాదగ్రంథము నాదరింతురని యాశించుచున్నాను."

## కొన్ని యితరాభిప్రాయములు

కృష్ణాపత్రిక: "జగద్విఖ్యాత తత్త్వశాస్త్రవేత్తలగు రాధాకృష్ణన్ గారి ఉపన్యాసముల నిట ప్రస్తుతించుట అనవసరము. అనువాదము కూడ సరళముగ నున్నది."

ధర్మసాధని: "ఇట్టి యుత్కృష్టగ్రంథమును ఆంధ్రములోనికి భాషాంతరీకరించి ఆంధ్రవాఙ్మయమునకు వన్నె తెచ్చిన కామరాజు హనుమంతరావుగారి కృషి ప్రశంసాపాత్ర మైనది."

ఈ గ్రంథము చెన్నపురి, ఆంధ్ర విశ్వవిద్యాలయములందు బి. ఏ. పరీక్షకు పఠనీయగ్రంథముగ (B. A. Part II. Detailed Text) నిర్ణయింపబడెను.

# జీవనస్మృతి

కర్త: శ్రీ కామరాజు హనుమంతరావుగారు.

ఆంధ్రపత్రిక:—

"వీరు (బాపయ్యగారు) నడివయసులో అసువులు బాసినను, సంతత కార్యదీక్షచే మహత్తరకార్యములను జేయగలిగిరి. అట్టి ఆంధ్రప్రముఖుని చరిత్రము సులభశైలిలో వ్రాసి, జీవితపు వివరములను చక్కగ తేటపరచి గ్రంథకర్త ఆంధ్రప్రపంచమునకు మహోపకార మొనర్చెను."

THE JOURNAL "*Triveni*":- "The art of biography-writing is yet in its infancy amongst Andhras but we trust that this splendid book will stimulate similar efforts. We wish to add that every Andhra ought to read the book and commune with the lofty spirit of Bapayya."

ఇది ఆంధ్రవిశ్వవిద్యాలయమునందు ఇంటర్మీడియేటు పరీక్షకు పఠనీయ గ్రంథముగ (Non-detailed Text) నిర్ణయింపబడెను.

## Shakespeare and the problem of Evil.

M. V. N. SUBBA RAU M.A.

TRIVENI: "Mr. Subba Rau writes with much persuasive sweetness on many aspects of the problem

HINDU. "......does credit not only to his obvio enthusiasm for the subject but to [illegible] readin The problem of evil has always had a fascinati for the philosophic mind and Mr. Subba Rau h shows us how the world's greatest dra[illegible] solved it."